శ్రీ శుభమస్తు

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీమద్విరాటు పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాముల వారిచే

వచింపబడిన గ్రంథము

# భవిష్యత్తు

# కాలజ్ఞాన

# మేలుకొలుపు

ఇయ్యది

కీ॥ శే॥ శ్రీ షేకుభిక్కన్ సాహేబుగారి కనిష్ఠ పుత్రుండును

నల్లగొండ జిల్లా॥ వ॥ తాలూకాలో చేరిన మోరెపల్లి గ్రామనివాసుండును

**మహమ్మదు కాశిం కవిచే**

రచింపబడినది.

పరిష్కర్తలు :

**శ్రీయుత బ్రహ్మశ్రీ కన్నెకంటి చిన్న లింగాచార్యులు**

**శ్రీయుత వీరభద్రాచార్యులు**

(శతావధానులు)

దాచెపల్లి, పల్నాడు తాలూకా, గుంటూరు జిల్లా.

ప్రకాశకులు :

**శిద్దేశ్వర పబ్లికేషన్స్**

శిద్దంబర్ బజార్, హైద్రాబాద్.

 1989 (వెల : 6-00

శ్రీశుభమస్తు

శ్రీరామానుజాయః

శ్రీశుభమస్తు అవిఘ్నమస్తు ఆరోగ్యమస్తు

(తదాస్తు)

# కాలజ్ఞాన మేలుకొలుపు

## ప్రార్థన

గురుర్బ్రహ్మం గురుర్విష్ణు గురుర్దేవ మహేశ్వర
గురుసాక్షాత్ పరబ్రహ్మం తస్మై శ్రీ గురువే నమః

శా॥ శ్రీరమ్యంబగు పోతులూరి హరిపై చిత్తంబు గీలించి సం
సారంబీదగ భక్తినిలిపి మన సంచారంబు నన్మించి సం
ధారామున్డై నిర్వికల్పిత నినున్ ధ్యానించి చింతించెదన్
భూరి శ్రీవచనోక్తులిమ్మి గరుణన్ భూనాథ సర్వేశ్వరా॥

(నల్లవాడ నీవాడనన్ను గానగరావా అనుమాదిరి)

### కీర్తన

1. వందానములూ శ్రీ పోతులూరి వంశపావనా వందా॥
కందిమల్లయ పల్లెను ఘనపురమున వెలయుచును
వందితులై జనన మరణ వరుసా దెలసీ వందా॥

2. జాతి మతంబుల భేదము సలిపెడి వాదకులనుగని
రీతిగాదిదనుచు రుషుల జాతి తెలిపివా వందా॥

3. ఇల తను ధనమైశ్వర్యంబులు చిరమనుబడి వెఱనుగని
కలవతె జల బుద్బుదమని దెలియపరచినా వందా॥

4. పామరులను జేరి విమన భావముగచుపరచియు యే
నేమము లేనట్టి పరంధాముడిదే యనిన వందా॥

5. కన్నులు గనరాక రెడ్డి యెన్నో దినములనుండిన
మన్నన జేసియు నాతని కన్నులు యొసగిన — వందా॥

6. బాధలు బడుచున్న కుష్ఠ వ్యాధిగ్రస్తులైనవారి
బాధలన్ని ఘడియలోన బాపి రూపిడిన — వందా॥

7. మరణము నొందినవారిని మరల సజీవులుగ జేసి
కరుణన్ భవ రహితమైన కారణమొసగిన — వందా॥

8. యంతటివాడీతండని పంతమాడు మానవ పశువులకై
వింత మహాత్మ్యములజూపి వేడబడితిరార్య — వందా॥

9. అల్లరి జనులకును మహిమ కొల్లలు గనుపరచియు
నుల్లములన్ దృఢపరచిన చల్లని నా తండ్రి — వందా॥

10. ఆదిమధ్యాంత రహిత అద్వితీయ అప్రమేయ
భేదరహితుండవైన సాధు వత్సలుడ — వందా॥

11. సర్వ వ్యాపకుడవయ్యి సర్వాంతర్యామివయ్యి
సర్వపాలకుడవైన నిర్వికారుండ — వందా॥

12. ఆకారము లేకను నిరాకారుడవైయ్యి పిదప
లోకము రక్షించుటకై సాకారుడవైన — వందా॥

13. భవముల భారము మానుప యవతరించినావు తండ్రి
అవనిన్ యుగయుగములందు ఆధారుడవైన — వందా॥

14. వీరంబొల్లెయ్య మరియు వీరప్పాచార్యులనియు
వీరబ్రహ్మేంద్రుడవని వెలయుచునుండితివి — వందా॥

15. నమ్మిన జనులకును వరములిమ్మహి కొదువయునులేక
నమ్మిన భక్తులకొసంగు పావన యవతార — వందా॥

16. మారకోటితేజ దివ్య మహిమాన్విత గావుమయ్య
కో[illegible] నినుగాంచ — వందా॥
సియు భాసీములికని
ములెన్నకుము — వందా॥

శ్రీ రస్తు

శ్రీరామ శుభమస్తు

శ్రీశ్రీశ్రీ జగద్గురు విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః

# ( మేలుకొలుపు )

తే॥ గీ॥ చాలు నిద్రియు జనులార చాలు చాలు
మేలుకొనుడిక సంధి కాలముగాన
అద్భుతంబగు చిత్రములవనిపైన
జరుగునంచని బ్రహ్మము జాటినాడు॥

పాట

1. ధర్మయణువంత్రైనలేక యధర్మమే సద్ధర్మ యనుచును
కర్మలను జరిపేటి దుర్జన కాలమటుగాయెన్
మనుజా మేలుకొనరా॥

2, మేలుకొనరా మనుజ నీవు పొలుమాలి యుండబోకు
కీలెరింగి యుండకున్న మేలుగాంచవుగా మేలుకొనరా॥

3. కలియుగంబిపుడుడగె నిర్మల కాలమిగో నారంభమయ్యెను
తెలుసుకొనుడిక నిద్రనుండి తెలివి నొందియును మేలుకొనరా॥

4. జగతిపైన ప్రమాదములు బహు జరుగబోవును గాన జాగ్రత
యుగముయొక్క సంధిదే తగుయూహగాంచుమురా
మేలుకొనరా॥

5. శక్తులిక నేతెంచువేళ్ళిది యుక్తిగను చరియించుడిత్తరి
భక్తులను గాచేటి ఈశుడు పయనమగుండెన్ మేలుకొనరా॥

6. చండిరాజ్యము నుండి వచ్చెడి దండుఘాతల కోర్వజాలరు
దండిపీరుని వేడుడిప్పుడె అండ నీకనుచూ మనుజా మేలుకో॥

7. పెద్దలను దూషించు నాస్తిక బుద్ధిమాలిన హీన జనులకు
సిద్ధమిది గద్దించిఖల్లల గుద్దులయ్యేను మనుజా మేలుకో॥

8. దండిగా దుష్కర్మ జనులను దగ్ధమొందించేరు శక్తులు
నిందువేదుకతోడ భక్తుల నెలమిగా చెదరూ మేలుకొనరా॥

9. తడవులేదిక వీరగురుడువు పుడియలో కలిగించు ప్రళయము
మడతు రందరు క్రూరకర్ములు మహిని వీడియునూ
మేలుకొనరా॥

10. వేకువాయెను కృతయుగంబిక వీరభోగవసంత రాయుల
రాకదౌను పొగరుబోతుల పోకణంచుటకూ మేలుకొనరా॥

11. కల్లలని బలుకంగ బోకుడి ఖాసిమేకద ప్రాసెనంచని
తొల్లి శ్రీగురు డానతిచ్చెను తొలగబోవకున్ మేలుకొనరా॥

కం॥ కందీ మల్లయ పల్లెను
విందుం డై వెలయుచున్న వీరబ్రహ్మం
పొందుగ జెప్పిన వాక్యము
లందరు వినవలయు మిగుల నానందమునన్॥

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మముగారి నిజమైన గురుకీలకం

## మే లు కొ లు పు

(తత్వం) రాగము బేగడ చాపు తాళము)

1. మేలుకొనుడిక మోసపొయ్యేరు జనులార గురునిజోలి ఏమరకున్న
బ్రతికేరు మేలుకొని శ్రీ వీరగురుని మేరయిదియె నాలకించుడి
గేలిజేసెటి వారలెల్లరు కాలుతాళై తల్లడిల్లెరు॥

2. పట్టణంబులు కొల్లబోయ్యేను దుష్కర్మ జనము పుట్టిగా నశించి పోయ్యేను తుట్టిమానవులంత జహా ఇక్కట్లులనుభవులయ్యె చెడుదురు వట్టిమాటలుగావు యగ్ని వరుషములచే నాశమయ్యేరు ॥మేలు॥

3. తల్లిబిడ్డలు తగవులాడేరు తండ్రులతొ సుతులు కల్లగాదిక కలహ మాడేరు ఎల్లమానవులంత న్యాయ మొల్లకను వర్తించుచుండెరు పల్లెలు పట్నాలు పాడై యల్లరీ జనులంత నొచ్చేరు ॥మేలు॥

4. వింతవింతల వ్యాధులెగసెను భువియందు నరులు చింతలై చీకాకుజెందేరు వింతయౌ వ్యాధులకు వైద్యము సుంతయైనను బారదని భగవంతుడీ ధరయందు బల్కిన వాక్కులివి నిజమనుచు నమ్మండి ॥మేలు॥

5. వట్టివాదులు జేయుచుండేరు వేదాంతశూన్యు లెట్టిదో హరి కీలు గనలేరు పొట్టకయ్యి యొకరినొరు గొట్టియార్జన జేయుచును హరి గుట్టుగనకాముదపు గింజలు చిట్లినట్లె చిట్లిపోదురు ॥మేలు॥

6. పిడుగులునుబడి భీతిజెందేరు విష గాలివాన నుడిబడి తలలవని ముడిచేరు అడుగునకు మేదడ్డుగు లొదలెటి వడిగలింగిన మాయ జంగాలథలకే చనియెదరు కొందరు యడవులెండి తరబడుచును ॥మేలు॥

7. నీతులెన్నో బలుకుచుండేరు షడ్వర్గములకు చేతులే జోడించుచుండేరు భూతముల యందేకరీతిగ ప్రీతిగలిగియు జూడనోపరు జాతిభేదములందు నెక్కుడు ధాకచక్యము గలిగి చెడుదురు ॥మేలు॥

8. భుగులు భుగులు ధ్వనులు మింటాను కలుగూను పిమ్మట దిగులు పడి నలు దిశల వెంటాను పగలు రాత్రి యనక ప్రజలు మగువ లను విడనాడి పిల్లల మొగలనూ గనకుండ సతులు విగతులై చనిమేరు భీతిన ॥మేలు॥

9. మతములకు వ్యతిరిక్తులయ్యేరు నవనాచరికతే మితముగా సత మనుచు దలచేరు హితగుణంబులు వీడి యాగ్రామతులచే దుష్కర్మ ములను పవిత్రమనీ ఇహాగాచరించుచు వెతలనొందుదురు రవని మిక్కలి ॥మేలు॥

10. క్రూరులను ఖండించివేతూరు అజానుబాహులు వీరులయ్యేల నుద్భవింతూరు దూరెదరు పాపులను తొమ్మిది మూరలెత్తు గలుంగు శక్తులు కోరిదుష్టుల తలలు గోసియు మారణము గావించి పోదురు ॥మేలు॥

11. నమ్ము డీధాన్యంబు ప్రియమగును మసిపాత మాడకమ్మెదురు భువియందు నయముగను ఇమ్మహిని పుడమీశులందరు సౌమ్య సిలియెదరవనిదోచక దిమ్మరూలయ్యేదరు సమరము లిమ్మడై యదవులకు నేగెరు ॥మేలు॥

12. ఆకశంబు యరగ్నియయ్యేను భుగులొంది జనుల కన్నహారము సున్నయయ్యేను ఆకలాకలటంచు జనులు యాకులలములు యడవు లందున మేకలావలె దినుచు తుదకు శోకపూరితులయ్యి చచ్చేరు ॥మేలు॥

13. కొండలందున కేకలయ్యేను విపరీతమైన మెండుగార్భాటంబు లయ్యేను మండలంబున మనుజరూపంబుందు పచ్చని వర్ణమందున

దండిగను కమలాప్తు నందున యుండి ధీరుల కండ్లకగుపడు ॥మేలు॥

14. ధాత్రిలో బహు వింతలయ్యేను పాతాళగంగ గను మాత్రమైనను లేక పోయ్యేను యాత్రలును జరిగేటి దివ్య క్షేత్రములు పాడయ్యి పోవును రాత్రియర్ధా కాలమందున రవి వెలుంగుచు గానుపించును ॥మేలు॥

15. గాలివానల గోలమించేను నెల్లూరు సీమను చాలగా జలమందు ముంచేను కాలగతి బెజవాడ బందరు కూలి గృహములు నీటి మయమై వేలకొలదిగ ప్రాణులప్పుడు నీలిగెదరని యానతున్నది ॥మేలు॥

16. ఒకరి క్షేమంబొకరు గనలేరు యవ్వరికి వారె తకపికల్ బహు గాను గొనియేరు ప్రకటితంబుగ తెలిపెదిదుగో ప్రజకు సౌఖ్యము దొరుకబోదిక సకలజాతి దొరలుచాలా వికలులయ్యి కష్టపడెదరు ॥మేలు॥

17. సుజని కాలములవని నిలిచేని ద్వాదశని బూని భజనజేసెటి వారె వెతసీని నిజముగా బంగాళ దేశ ప్రజలు నీటమునింగిచనెదరు కుజనులను దండనము సేయుచు కూలదన్నును రక్కసులును ॥మేలు॥

18. మారుతములై దేకమయ్యేను అనుదినములేదు వారములు విడ కుండ వీచేను భూరి వేలకొలంది పురములు మారుతముచే కూలి గృహములు తారుమారై కొన్ని ప్రాణులు తల్లడిల్లేటి యోగ మున్నది ॥మేలు॥

19. జాగుసేయకుం డంతమొందేరు బ్రహ్మమును విడక జాగరతులై వేడకుండేరు కాగలకార్యంబులన్నర ఘడియలో యగునంచెరుం గుడు యోగినీశక్తులకు లోనై యుండగూడదు మోసమౌ తుద ॥మేలు॥

20. ధూమకేతువు లుద్భవించేనుఅమావాస్య దినమున సోముసుదయము గానుపించేను భూమియంతయు బయలు బయలై గ్రామములు ఏడింటి కొక్కటి రామయని మొరలీడు చుండెడి ధీమతులె శేషించు వారలు ॥మేలు॥

21. జలనిధుల్ నదులన్ని పొంగేను సాగరములందు పలువిధములగు ప్రాణులాలోను జలము రక్త మాంసముల లోపల గలింగిన సలిలమంతయు వెలయగా నొక ఝామలింకియు మెలుకువతొ నిలచేరు పుణ్యులు ॥మేలు॥

22. వత్తులై దేహమున మండేరు వేదాంతులందా తత్తరలపాటొందు చుండేరు ఉత్తమోత్తములైన బ్రహ్మ వేత్తలే నాయాసమొందెరు మొత్తములో పది స్త్రీల కొక్కడు యుత్తముండౌ పురుషుడుం డును ॥మేలు॥

23 పెక్కు వ్యాధులవల్ల సమసేరు ఈ వార్తలన్నుక్కక్కి యని జనులార యరసేరు నిక్కముగ చనువారికేడ్చెడి దిక్కుయవ్వరు లేకపోదురు మక్కువతో శవములను గాంచెడి కుక్కలే దరిజేర వచ్చెదు ॥మేలు॥

24. చిన్నవారలు విసుకుగొనియేరు యీ వింతలన్ని యెన్నడో మన మెరుగుటనియేరు అన్ని దేశములందు గలుగు నద్భుతములగు వింతలిప్పుడే ॥మేలు॥

25 వీరుడై యిల యవతరించేను పరమాత్ముడఖిలా కారకుండై ఘనుల గాచేను ధారుణీ ఖండంబులన్నిటి వీరభోగ వసంత రాయులు ధీరుడై రణశూరుడయ్యి దీవలన్నిటి నేలుగావున ॥మేలు॥

26. వాసనలు విడవాతకున్నారు ఈషణములందు యాస బహుగా జేసియున్నారు భాసురంబుగ దోరెపల్లి నివాసియైన మహాత్మ దీయుడు ఖాసిమలి వాక్యమును నమ్మియు గాంచుడీ బ్రహ్మమును మేలుగ ॥మేలు॥

మేలుకొనుడిక మోసపొయ్యేరు జనులార గురుని జోలి ఏమర కున్న బ్రతికేరు।



శ్రీ

శ్రీశుభమస్తు

శ్రీశ్రీశ్రీ శ్రీసద్గురు విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామినేనమః

# (కృతి సమర్పణము)

శ్రీ సర్వేశ్వరుండగు జగద్గురు విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని సంస్మరించి శ్రీ ఈశ్వరీ మహాదేవికి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి గణపతిని ప్రార్థించి సరస్వతిని నుతించి శ్రీమద్వేదాంత సార సచ్చిదానంద స్వరూపులగు బ్రహ్మశ్రీ వేంకటేశ్వర స్వాములవారిని సేవించి శ్రీమదఖండాచల స్వరూపులగు బ్రహ్మశ్రీ శ్రీనివాస స్వాముల వారికి బ్రణుతిజేసి పూర్వాపూర్వ వేదాంత కావ్య జ్యోతిష విద్వాంసులగు శ్రీ పండితోత్తములందరిని యనేక విధంబుల గొనియాడి క్రమత్సాటు కొండ సుబ్బయాచార్యులవారిని శ్రీ జవంగుల నాగభూషణాచార్యుల వారలను గీర్తించి శ్రీ కాలజ్ఞాన మేలుకొలుపను గ్రంథము మోక్షాసక్తుండనై రచించి శివకేశవావతారుండగు శ్రీ వీరభోగ వసంతరాయులవారి పాద సరసీరుహంబులకు కానుకగా సమర్పించు కొనుచున్నాడను.

మంగళం మంగళం మంగళం

ఇట్లు

గ్రంధకర్త

శ్రీ

శ్రీసద్గురుభ్యోనమః

శ్రీ రా మ శు భ మ స్తు

సీ॥ 1. వరుస వావులణంగి వసుధ పాడయ్యెను ।
రంకులు మెండాయె జంకులేక ॥

2. న్యాయంబు శూన్యమైపోయెను పుడమిని ।
తగవులు పక్షపాతంబులయ్యెను ॥

3. సూనృత మనునది సూక్ష్మమై పోయెను ।
అనృతమే మూలమయ్యె జగతి ॥

4. కన్న తల్లియుదండ్రి కన్నులు లేదాయె ।
వేశ్యల పొందుకై వేలుగలిగె ॥

5. ధర్మంబు లేశమై ధరణిలో వర్షముల్ ।
సస్యానుకూలము సమసిపోయె ॥

6. ఫలవృక్షములు ధాన్య పంటలు నశియించి ।
కంట్రోలు ధాన్యమే గడుపనాయె ॥

7. తాను కష్టించియు తగ ఫలించిన పంట ।
శేషమున్నటువంటి శిలకుగింజ ॥

8. దాపుడుకయ్యె భూస్థాపన యగుచుండి ।
కష్టములెన్నియో గలుగనాయె ॥

9. దుర్విద్యలన్నియు దొడ్డవి యాయెను ।
సద్విద్య నెవ్వరు చదువరైరి ॥

10. ఆడవారలకును యధికారమబ్బెను ।
గోటను పురుషుల మీటనాయె ॥

11. తల్లిదండ్రుల మాట తప్పుడువాయెను ।
పెండ్లాము లంజలే పెద్దలైరి ॥

12. సత్య విచారణ జరుగుట లేదాయె ।
నిత్యకర్మాదులు నిలిచిపోయె ॥

13. విప్రుల వృత్తులు వివిధములై పోయె ।
పలుతెరంగుల తిరుగుబాటులాయె ॥

14. దైవము నెవ్వరు దలచుట లేదాయె ।
వార్తపత్రికలపై వాంఛలాయె ॥

15. సత్యచరిత్రముల్ జనవిరోధంబయ్యె ।
పూజితమయ్యెను బుఱ్ఱకథలు ॥

16. తే॥ గీ॥ కలియుగం బిట్టులౌటను గనియు నేను ।
చాల భయమంది సంసార సాగరంబు ॥

17. దాట నీపాద పద్మముల్ దలచినాడ ।
దేవ బ్రహ్మేంద్ర జగతి శ్రీ దేశికేంద్రా ॥

శ్రీ

శ్రీ శుభమస్తు

(హరిః ఓం)

గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్పర బ్రహ్మం తస్మై శ్రీ గురువేనమః
అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శనం యోగం తస్మై శ్రీ గురువేనమః

**మహాశయులారా!**

నేటి ప్రపంచంబంతయు నల్లకల్లోలముగా బహు ప్రళయంబులతో నున్నది లయకాలము లగ్నంబుల బెట్టుకొని ప్రపంచము పైకి పరుగిడి వచ్చి యావరించుకొని యున్నది కాలమాన పరిస్థితులు క్షణ క్షణంబునకు మారుచుండెను యిదియే కలియుగాంత మనియు కృతయుగము వేకువ యగుచున్నదనియు నిస్సంశయముగా దృఢమగుచుండెను అనతికాలము లోనే వీరధర్మము జరుగవలసిన యోగంబున్నదనియు మరియు ఈ లోపల నానా అల్లకల్లోలములచే అన్యోన్యమగు కలహ యుద్ధములచే మరియు విషజ్వర మాదిగాగల విపరీత వ్యాధుల చేతను వింత శక్తుల చేతను దుర్మరణంబులచే ప్రజాక్షయంబై తత్పూర్వులే వీరకాలము గాంతురనియు.

శ్లో॥ ఖరే ఖరే ధనుర్మాసే । తృతీయాం శుక్ల పక్షకే
సోమశ్రవణ మధ్యాహ్నా । వీరభూపాల కోపతిః ॥

ఈ కలియుగము (5052) సరియగు ఖరనామ సంవత్సరమున శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి పట్టాభిషేకం జరిగియు దుష్ట శిక్షణ శిష్టరక్షణచే కలియుగముయొక్క పాపభూభారమణంపి ప్రపంచంబంత నేకచక్రాధిపతియై సత్యయుగమగు కృతయుగ ధర్మము స్థాపించ వీరభోగ వసంతరాయుండను నామావతారుండై రాబోవు చున్నాడనియ ........................శ్రీమదఖిలాంకోటి బ్రహ్మాండ నాయకుం డును, భూనభోంతరాళాంతర్బహిర్వ్యాపకుండును, అఖండ మండలా కారుండును, నిరాకార నిరాధార నిర్గుణుండును, నిర్వికార నిత్యా నందును, సచ్చిదానంద ప్రకృతి ద్వయదోష రహితుండును, నాద బింధు కళా తీతుండును, నచల పరిపూర్ణుండును, నశరీరుండును సకల చరాచర సంభూతుండును, ఆది మధ్యాంత నామ రూప రహితుం డును, అవాఙ్మానస గోచరుండును, మూర్తిత్రయ రహస్య స్వరూప దేదీప్యమాన సాహసోల్లాస మయుండును, ఇంద్రాది దేవతలచే కొని యాడంబడు ప్రకాశ స్వరూపుండును, సద్భక్తజన హృదయ సరోవర నివాసుండును, సర్వ వ్యాపకుండును, విశ్వంభరుండై నిండి నిబిడీకృ తంబై వెలుంగు అనంతావతార సచ్చిదానంద సాకార స్వరూపుండును, అనంత నాముండును శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు కలియుగ మహాత్మ్యమును వచన కాలజ్ఞానము మరియు శ్రీ స్వాములవారి సంపూర్ణ జీవిత చరిత్రము మరియు గోవింద వాక్య ములను గ్రంథముల ద్వారా వెల్లడించియున్నారు.

## ( వీరి నే )

మహమ్మదీయ............ శ్రీ యిమామల్ జహాద్ ...... అనియు
వైదికులు................ శ్రీ కలికి అవతారము.......... ,,
లింగాయతులు............. శ్రీ చన్న బసవేశ్వర్లు.......... ,,
శిక్కులు................. శ్రీ నిష్కళంకి................ ,,
క్రిశ్చానులు............... శ్రీ రుద్రాంశ గల ఏసు........ ,,
మారువాడీలు.............. శ్రీ పార్శ్వనాథ.................. ,,
జైనులు బౌద్ధులు.......... శ్రీ శాంతిదాయకుడు............ ,,
శివభక్తులు................ శ్రీ ఈశ్వర అవతారము........ ,,
విష్ణుభక్తులు.............. శ్రీ మన్నారాయణ మహావిష్ణు...... ,,
విశ్వబ్రాహ్మణులు........... శ్రీ మద్విరాట్ స్వరూపుడు శ్రీ వీరభోగ వసంతరాయులనియు నన్ని మతములవారు మతమున కొక్కొక్క నామము చే వాడుకొనియెదరు.

కృతయుగధర్మ సంస్థాపనకై శ్రీ స్వాములవారు వచ్చువరకు జరుగబోవు హేతుర్భూతములు ఇందు వివరింపబడుచున్నవి. వారు ఈ విధముగ ఆనతిచ్చియున్నారు.

ఏమనగా - నేను వీరభోగ వసంతరాయుండనై యీ వసుధ యందు వచ్చువరకు ననేకములగు మహోత్పాతములు పుట్టును అవి యెవ్వియనిన కలియుగము (4808) జరిగిపోయిన పిమ్మట భూలోకములో ధర్మదేవత పుణ్యస్థలంబులలో తిరుగు చుండును. వావావరి పాపంబులు హెచ్చి వెందునలేని కలహంబులు పుట్టును. న్యాయమునరగి

పోవును అన్యాయము వృద్ధిబొందు చుండును కలియుగయు (5000 మొదలుకొని జనులు జాతిమత భేద కలహములు గావించుకొనియెదర పిన్న పెద్ద యనెడు మర్యాద భేదంబులు మాయమైపోయ్యేను పయిర్ల కొంచెముగా ఫలించేను గోవులు కొంచెముగా పాలుపిండేను దేశములక క్షామములుకలుగును పతిభక్తి పాడైపోవును మాతృ పితృభక్తి మంట్ల గలసేను భార్యాభర్తలకు వైరంబులు బుట్టేను తండ్రి కొడుకుల తమలో దాము కలహించేరు జాని వర్తనలు దప్పి నడచేరు కామ క్రోధం బులు హెచ్చేను మానవులు జ్ఞానవిహీనులై చరించేరు శాంత విహీనులై కోపవంతులయ్యేదరు అధిక ఆహారము అధిక నిద్ర గలిగియుందుర మత్తు పదార్థములలో మునుగుచుందురు నీచులు అధికులగుదురు అధికుల ఎందున గౌరగాకయుందురు జనులు తమ తమ స్వమతతబులను వద అధర్మకాములై దుష్కర్ములైపోదురు శూద్రులసత్యవాదులై నీచసాంగ త్యముచేత దరిద్రులై పెక్కు యాపదలపాలై చెడిపోదురు జనుల అర్కటించి యరచి చత్తురు అష్టాదశవర్ణముల వారు మేకకసురుతిందుర విప్రులు తమ తమ ధర్మంబులను విడచి మనిషికొక్కొక్క మతమై నీచుల నాశ్రయించి నీచ కార్యంబులంజొచ్చి దేశాలపాలై చెడిపోవుదుర ప్రతి జాతియు సంకరంబై పరస్పర వైరంబులు హెచ్చి యనేక మతకలహముల వలన కొట్టుకొని మరణింతురు మరియు సమస్త జనుల నాస్తిక దుష్కర్మలవలన బహువిధంబులైన కష్టంబులొంది చెడిపోవ దురు ఒకరిసొమ్ము వకరపహరించేరు చోరరోగ ఉపద్రవములు హెచ్చేను అగ్నిభయంబులు అధికమయ్యేను అడవి మృగంబులు గ్రామాదులలో చేరేను గ్రామాదులలో చోరులెక్కువై ధన ధాన్యములు దోచుకొని పోయేరు వారిని విచారించు ప్రభువులే లేకుండెదరు అడవియంతయు

సూన్యమై భూములరాచకములై ధర్మనిర్మూలమై దేశంబులలో జను లనేకముగ వ్యాధిగ్రస్తులై నశించెదరు.

(రాజానుమతే ప్రజః యను న్యాయములకు మారుగా ప్రజానుమతేరాజః)

యను న్యాయంబు సత్యంబయ్యేను రాజులు ప్రజలకు భయ పడేరు ప్రపంచము బహు ప్రళయంబులతో నుండును కాల ప్రకృతి ధర్మంబులు తలక్రిందై నడువంగలవు దేశములందంతట తెగుళ్ళు చెలరేగును పాపిష్టులంతాపాడయ్యేరు ప్రతి గ్రామము నందును ప్రతి పట్టణమునందును ప్రజలలో అన్యోన్య వైరములు గలిగి ఒకరినొకరు కొట్టుకొని రచ్చకొట్టాలకు చేరేరు రచ్చకొట్టాలకు ప్రజలే రాజులయ్యేదరు రాజాస్త్రీలు రచ్చకొట్టంబులలో రాజరికంబుజేసేరు స్త్రీలబలము హెచ్చి పురుషులను ఎందుకు పనికిమాలినవారిగాజేసేరు ముండలంతా ముత్తైదువ లయ్యేరు ఇంకను అనేకమహోత్పాతబులు పుట్టుచున్నవి భూతగ్రహ చేష్టలు అధికమయ్యేను కావేరితీరంబున శక్తి బుద్దేను కలహంబులు నమి తంబుగా జరిగేను ఒక్క ముహూర్తమందు ఏడుపుట్ల నల్లులు రాలేను గొడ్డుపోతు ముండలకు బిడ్డలు పుట్టెదరు. మరియు నా తోడ నా మాయా శక్తి కనక దుర్గంబయ్యై పుట్టియున్నది దానిచే కొందరు నశించగలరు మరియు కొండ శిఖరములపై మంట లెగయును. అందున కొందరు నశింతురు మల్లికార్జునస్వామి ప్రజలతో మాటలాడును. అటులంగొందరు మ్రగ్గుదురు. కంచికామాక్షమ్మ దక్షిణ దేశమునందుండు జనులకు నష్టము కలిగించును కర్నాటక దేశమునకు గాలియు తురకదేశమునకు దుర్గియు అరవ దేశమునకు వీరభద్రుడును నంది రాజ్యమునకు నాగేం ద్రుడును మొరవ రాజ్యమునకు భద్రాకాళియును సందుసందుల భయిర వుండును. హనుమంతుడును గలిగి బాలురు వృద్ధులు మొదలగుస్త్రీపురుష

లను తారతమ్యము లేక నశింప జేయుదురు. శ్రీశైలమున మల్లికార్జున స్వామి దేవాలయంబులో భోగమంట లెగయును దోషకారులకను చితంబులు బుట్టును. మరియు శ్రీ శైలమునకు మొసలివచ్చి భ్రమ రాంబికా దేవాలయంబున (8). ఎన్మిది దినంబులుండి మేకపోతువలె గూయును. పిమ్మట మటు మాయమైపోవును అందున కొందరు నాశన మునకు మూలమగుదురు గంగాయమునలుపొంగును రామదుర్గము నందు నొక చిలుక వీర ధర్మముల నెత్తిచెప్పును గోలుకొండయందు కొంగ మాటలాడును. కంచియందు నుత్పాతములు పుట్టును గరుడ ధ్వజమును కదిలింతురు. మల్లికార్జుని కనుల నుండి నిప్పు కణంబులు రాలును బసవేశ్వరుడు గజ గజ వణకును అతనినోట శబ్దముపుట్టును. అందున కొందరు మరణింతురు. సూర్యమండలమునుండి నిప్పులు ధణ ధణమని భూమిపయింబడును. అందున కొందరు నీల్గుదురు కొండల రాయుని ఏలూరు పాడగును తిరుపతి శ్రీ వెంకటాచలపతి గుడి యందు మ్లెచ్చులు జొరబడుదురు. దివ్య క్షేత్రములన్నియు తురకల పాలగును. జనులందరు వీరబ్రహ్మముగారి చరిత్రమందు నాసక్తులగు దురు అర్ధరాత్రియందు సూర్యుండు పుట్టును అందున కొందరు నశింతురు. మరియును మరికొన్ని ప్రమాణంబుల దెలియం జేసెదము సావధానం బున వినుడు పాతాళ్ళ గంగ యందు నీల్లింకిపోవును భూతలంబున మంట లెగయును నూటా ఎనిమిది దివ్య తిరుపతులు పాడైపోవును శ్రీ శైల పర్వతము పాడైపోవును. వీరబ్రహ్మము వచ్చునంతలో దుష్టులెవ్వరు నగుపడకుండ మటుమాయ మగుదురు మరియును ధనమీ నాశమ్ము జనులతో ముచ్చట లాడును. గుణముగల వారందరును బన్గారివలెనైను చేరుదురు గుణములేని వారలు కూలుదురు ఇదియును

గాక మేమువచ్చునప్పటికి యింకొక చిత్రము పుట్టును. అది యవ రెత్తింగి నడుతురో వారిని వీరబ్రహ్మము రక్షించును. నాలుగు నిలువుల ప్రమాణంబుల యాజాను బాహులువచ్చి మే మే వీరభోగ వసంతరాయుల మని చెప్పుదురు. అట్టి వారిని మూఢులు నమ్ముదురేగాని నా భక్తులెంత మాత్రము నమ్మరు. మరియు వినుండు వీపున వింజామరలు అరకాలువ యమరగల వారువత్తురు వారిని నేనని భ్రమింపకుడి, ఇట్టి విచిత్రములెన్ని పుట్టినప్పటికిని నా భక్తులైన వారలు ఎంతమాత్రము నమ్మగూడదు నే నైనందుకు గుఱుతే మంటిరేని వినుడు. నేను వచ్చునప్పటికి కంది మల్లాయెపల్లిలో నవరత్నముల మండపముగలిగి పన్నెండామడ పట్టణ మగును కైలాశంబున శుద్ధియై వెలుంగును. యిదే మీకు గురుతు నా రాకకు నమ్మక మేర్పడియన కాగల కార్యంబులన్నియు నర ఘడియలో యగునని యెఱుంగుడు ఈ సంగతులన్నియు ననుభవంబు పైకంగాని తెలిసికొనలేరు. మరియు మనుజులతో వాయుశక్తి మాటలాడును పంది కడుపున ఏనుగు బుట్టును. కోడి మనుష్యుని మాతవెంబీ కూత గూయును బనగాని పల్లెయందు పాతరపై చింతచెట్టు మొలచి జాజిపువ్వులు పూచును ఏడువేల పుట్టనల్లలు రాలును నక్షత్రములట్టులనే రాలును. సూర్యుడు గడ గడ వణుకును ఆకాశంబున పచ్చని వర్షముతో మనుజ రూపంబు కనబడును. బళ్లారి భాగ్యము తొలంగి పోవును కంచి కామాక్షమ్మ కనులయందు నీళ్ళు జలజల రాలును అందున కొందరు చత్తురు కాళహస్తి ఈశ్వరుడు కళలందు బోగొట్టుకొని కంది మల్లాయెపల్లె చేరును. రామానుజ మతమువారు నియమము తెలియకయుండి పాతకులై పోదురు మట్టు ఆరని బాలలు మాటలాడుదురు ఆవుకడుపులో నున్న ఆత ద్రితముగ కనులకు గనబడును పల్నాటిసీమయందు భాగ్యము గలవారు మదముచే గూలుదురు. గోసంగి కులము గొప్పదై యుండును.

రాజాధిరాజులు దేశమువదలి భ్రష్టులై పోవంగలరు మరియు గ్రా
ములయందు ధనంబు తొలంగును. ఆరు నెలల బాలలు పాటలు పా
గలరు, మూడుకాళ్ల ఆవుకడుపున నొకడు పుట్టి ప్రజలతో వాదంబు
సలుపును సుగుణవంతులు దొరుకుట దుర్లభంబై యుండును. ఒకవే
నుండినను వారి గుణంబులు నా నాటికే నాశంబగుచుండును. భూ
యందు నోంకార శబ్దము పుట్టును. కావేరి మేరతప్పి వచ్చు
దొమ్మరివారలు దొరలగుదురు దొడ్డవారలందరు జెడుదురు ఇదిగ
నాభక్తులగు వారలు ధర్మంబు భూమిపై నెగజల్లుదురు అంగడి
యమ్ముకొందురు నేను వచ్చు నంతలో నిన్ని వికృతములు పుట్టు
మేలైన జనులు నిలుతురు చీమకుర్తి పన్నెండావమడ పట్టణమగు
బంగాళదేశము ప్రబలమై మానవులు జలంబున భిన్నమై పోదు
నాలుగు దిక్కులను అద్భుతమగు నక్షత్రమలు జనులకు కనిపిం
రాలేను దేవళంబులందలి విగ్రహంబులు నృత్యంబు సలుపును మం
బెల్లము చేదగును. వేపచెట్టున నమృతంబు పుట్టును. రాత్రులం
ప్రతిమలను చ్చైస్వరంబులతో రాగములు తీయును. దుష్టులు నీర
లగుదురు శిష్టులు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్య వంతులగుదురు ప్రపం
ములో ప్రతివారము నెట్టివింతయు లేక నుండదు శ్రీమన్నారాయ
మహిమ లప్పటికిగాని తెలిసి కొననేరరు, కాలమొచ్చిన దనుక కల్లలని
భావించు చుందురు భూత భవిష్యత్తు మహిమ నా భక్తులకై యిచ్చితి
ఇంకను సేకంబులైన చిద్విలాసంబులు కలుగును ఇందులకు సూచియవ
లేదు ఇంతకన్న మించిన వెతలకముందు జరుగగలవు యెవ్వియ ని
మానవులకును మదమత్సరము లధికమయ్యెను రాజులకు వైర
బులు పుట్టెను భావలు వ్రాసిన పటాంబములు పనికిమాలినవై పోయెను
నవనాగరికత హెచ్చెను విద్యాజ్ఞానంబు విపరీతంబుగా బలసి రాజులకి

నెదిరించేరు. వర్ణంబులన్నియు నొక్కటియ్యేను కోమటి కులమునందు మేలైన భక్తి యోగజ్ఞానము గలిగిన సత్పురుష్యులు (25) గోత్రముల వారు నిలుతురు. ఉత్తర భూమియందు ఉత్తమభేరి కోమటి మహాత్ముడై నిలచేను. ప్రపంచములో కేవల శాంతమూర్తియై సర్వ వర్ణముల వారిచే సన్మానములు పొందేను పగటి నక్షత్రములు గాన్పించెను అనేక ధూమ కేతువులు బుట్టేను నాలుగు ముఖముల చుక్కలు బుట్టి యిరువై ఐదు వారములు ప్రకాశించేను. అనేకముగ నక్షత్రములు రాలేను ప్రపంచములో సన్మార్గ ప్రవర్తనము చూచుటకై నా అయిష్టులై యుందురు. దుర్మార్గ నడతలకు ఆసించి కాములై వర్తించిరి. దర్వ్యాసచే దుర్మార్గులు స్త్రీలను అమ్ముకొనియెదరు ధారుణియందు సమస్త దేశీయు తెడతెగని యిడుములతో నుందురు. ప్రజలు బహుప్రళయంబుల చేత పొరయ్యేదరు. దేశంబులన్నియు నరిష్టంబుచే నుండును. భూత ప్రేత పిశాచాది గ్రహంబులు కోలాహలంబుగా నాడేరు వూరయూర కలహాంబులు నమితబంగు ఘోర యుద్ధంబులు విస్తారంబుగా జరిగేను. భూమి నెత్తురు చేత తడసేను మరియు పీనుగు పెంటలు గాన్పించెను మింటి నుండి గ్రామాదులలో లెక్కకు మిక్కుటంబగు పిడుగులుపడేను ఆకాశంబున పొగమంటలు బుట్టును. ఒకరియాలు మరొకరు పాలు అయ్యేను పుణ్య స్త్రీ పురుషుయి బ్రతికేరు దేశదేశంబుల ప్రజలు దేవతా పంపులు గలిగి శీతోష్ణ జ్వరాలచే మరియు మానవులు కడుపులలో మొకాళ్లలో మంటలుబుట్టి తొడలలో పోట్లుబుట్టి ముఖమందు అరచేతులలో పుండ్లు బుట్టి నోటియందు బొబ్బలుపుట్టి నల్లగాలిపోశి నెత్తురు గ్రక్కుచు గుండెలు పగిలి నడినెత్తి ప్రక్కలై గండమాలలు రాచ పుండ్లు అట్లు పోట్లు బొబ్బయి పుట్టి విచిత్ర వ్యాధులు గలిగి ప్రజలు కూర్చున్నవారు కూర్చుండినట్లే పండుకొనినవారు పండుకొనినట్లే

మాట్లాడువారు మాట్లాడుచునే పిక్కిలువాచి నడచు చుండినవారు న
చునే మగ్గెరు పశు మృగాదులు గుంపులు గుంపులుగా గూడి చచ్చే
ఊరయూరనొక శక్తి పుట్టేను. విశ్వమంతయు తల్లడిల్లిపోయె
ఉత్తరము ఉరిమి దక్షణము మెరసి పిడుగులుబడి నదులు
పొయ్యేను. ఆ వెంటనే మాయజంగాలు వచ్చేరు అడుగనకు ఏ
గులుగా నడచేరు మానవులు తల్లుల ముఖము పిల్లలు ముఖము తల్ల
చూడకుండ అడవులు బట్టుక తిరిగేరు ఇంకను కాయనకు రుతిని కవ
నిండక రేగడి మృత్తి కనురేఘుంబళ్లను తిందురు. అందున కొంద
చత్తురు నడిరూము రాత్రిన గ్రామాదులలో కేకలు వినంబడే
అందున కొందరు నాశనమయ్యేదరు నా రాకకు ముందు దుష్టులం
దూరమై నిర్వంశమై పోయెదరు నంది కొండకు ఉత్తరాన ఒక
ములో నూటా యిరువై లక్షల గుణ్ణములున్ను వికృతములైన మను
లున్ను ఉత్పత్తి యయ్యేరు. ఉల్లంబులన్నియు తల్లడిల్లేను అ
మృగాదులు గ్రామాదులలో చేరేను. ఊర యూర శక్తులు బెబ్బులు
వచ్చి మనుష్యుల గొంతులు కరచిచంపేను మరయు ఆకాశంబ
ధ్వనిబుట్టి కొందరు నష్టమయ్యేదరు. ప్రజలు హాహాయని అరచేరు వూ
అగును యముకలు కొండల పొదవున బడేను గాలివానలచేత శ్రీశై
మునకు దక్షణమున గుండ్లు దొర్లేను. నెత్తురు వానలు కురిసేను అంద
కొన్ని గ్రామాదులలో జనులు నష్టమయ్యేదరు కొండల యందు ఘణ
ఘణాం మను శబ్దములు వినబడేను. నానాటికి వింతలు హెచ్చే
వికారములు గలిగిన విలయకాలానకు భూఖండము లన్నియు గడ
నయ్యాని ఘనతరంబైన కేకలు బుట్టిని. మానవుల మనంబులు మా
తొమ్మిది మూరల ఎత్తుగల అజానుబాహులు వచ్చి దుర్మార్గుల
కోసేరు. ఆకాశమునందు బాకుక్కా వాకుక్కామను ధ్వనిబుట్టిని మరిం

ఆకాశమందు నాలుగు నక్షత్రములు ఎఱ్ఱగాను యద్దు ప్రకాశముగా ఒకటి కాన్పించెను అది చూచినవారు అమ్మరో ఇక బ్రతుకజాల మని అదరిపడి చచ్చేరు. ఎనిమిది మూరల శక్తి వచ్చి పాపాత్ములను అనేక విధములగు బాధలు బెట్టి కోసేరు. ఉత్తరము ఉరిమేను దక్షణము మెరసీ పట్టపగలు ఆకాశమందుండి అనేక పిడుగులుబడి నిప్పుల వానలు కురియును అష్టదిక్పాలకులు అల్లకల్లోలమై దేశమందు ప్రజలు తల్లడిల్లేరు రాజులు రాజ్యంబులను తమంతటతామె వదలి చీకాకై అడవుల కేగెదరు. రాజాస్త్రీలు జొన్నసంకటియైనను కరువై యడవులలో యాకులలమునురియ మృత్తికను తినుచుందురు మానవు లొకరి నొకరు గానక ఆహారనిద్రలు మాని అతి దుఃఖంబుచే కృశించి చచ్చేరు. పల్లెలు పట్నాల వారందరు అనేకముగ ఏడ్చేరు గృహములు భూములు సువర్ణ మణిమయంబగు నగలు న్యాయము మొదలగు యావ దాస్తులు నావికావు నీవేయనేడి దినంబులు వచ్చేను అరణ్యాదులలో ధన ధాన్యము గలిగెయుండేను ధాన్యము మన్ను పాలయ్యేను. భూమి కదలేను ఆకాశము యరద్రనయ్యేను, లోకమంతయు చీకటై అనేక నక్షత్రములు రాలేను అధోయను శబ్దము వినంబడేను. ఆవులు మిన్నుజూచి యరచి చచ్చేను. ఆకాశమున భుగుల్ భుగుల్ మని ధ్వనిబుట్టెను గ్రామాదు లలో పట్టణములలో నదులలో నెత్తురు వర్షము కురిసేను దుష్ట గర్వాంధులైన వారి కొరకు వికార స్వరూపమైన శక్తివచ్చి మానవుల దప్పులచేత తొక్కించి తొక్కించి కోసును అగ్నిస్నానం చేయించును. అంభోయిని యరపించును అనేకమగు బాధలు పెట్టును ప్రయాస జేయును యమబాధను వచ్చును ఏటిలో బడదొర్లియును శక్తులు దిగ మిర్రింగును అష్టాదశ వర్ణాలవారు ఒక్కచోట నీరు త్రాగుదురు అన్ని జాతులవారు ఒక్కజాతై యుండురు. భూమి యంతయు శక్తిమయము

మయ్యేను భక్తులగు వారలు భగవంతుడెక్కడయని దిక్కులుచూ
చుందురు. భక్తులు కాని వారలు బాణవర్షములచేత పాడైపోయెదరు
దుర్మార్గుల నెత్తురుచేత భూమి తడసేను ప్రతిఇంట దుఃఖించుచు
యుందురు రోదనంబు లేని గృహము ఎందున గానంబడ కుంటున
ఇంకను అనేకములైన వ్యాధులవల్లను విషవాయు వర్షములవల్లను
పిడుగులవల్లను అగ్ని వర్షములవల్లను కొండశిఖరములు బ్రద్దలగుటవలన
దుష్కర్మల వల్లను వింతశక్తుల వల్లను విషజ్వరంబులవల్లను జలనిధు
పొంగుటవల్లను ప్రపంచంబంతయు నీటిమయంబై మానవులనేకులును
పశుపక్షి మృగములు జలచర కీటకాదులు గృహములు మొదలగున
హరించిపోవును. పదుగురు స్త్రీలలో నొక పురుషుడగుపడుట దుస్తరమ
మరియు ఆకాశంబున కొండంత నక్షత్రంబు పుట్టేను. ఆ చుక్క పే
మనగా యుగము మార్పుచుక్క దానికే అనంత నామములు పెట్టుదురు
ఆ చుక్క పుట్టినప్పటి నుండి దానిని నరులు చూచి కొందరు నశించే
అట్టి కాలమున దుష్ట శిక్షణ శిష్టసంరక్షణార్థమై శ్రీ వీరభోగ వసం
రాయులు వచ్చుచున్నాడని గుర్తెరుంగుడు నేను వచ్చుటకు ముంద
కమ్మన్న పనులెల్ల నరఘడియలో యగునని యెఱుంగుడు నా భక్తుల
నన్ను నమ్మి పూజించుచు నారాకకై ఎదిరిచూచుచుందురు అట్టివారికి
భయంబులేదు. నేను వచ్చునది కార్తీకమని నిశ్చయింపుడు కార్తీ
అమావాస్యయందు చంద్రోదయ కాలమే వీర కాలమని యెరుంగుడ
అమావాస్య రోజున చంద్రోదయంబగును పువ్వుల వానలు కురియును
తూర్పుదిక్కున తోకచుక్కలు పుట్టును. భూమి కదలి గడగడ వణకేను
మరియును పంచవాయువులు కలిసి ఏడహోరాత్రములు యడతెగక
విసరును అప్పుడనేక గ్రామంబులుపాడై పశుపక్షి మృగాదులును
మానవులనేకులు రాలేరు. ఆకాసమునుండి వీరభోగ వసంతరాయుల

వచ్చుచున్నారని శబ్దములు వినంబడును భక్తులైన వారు అట్టి శబ్దము
లను విందురు అంబుధు లుప్పొంగును బండిమీదయొక కోడి వచ్చును.
దానిరెక్కలు విసురునకు గాలిసోకి లక్షలకొలదిగ జనులు చచ్చెదరు.
పిచ్చి నక్కలు పిచ్చి కుక్కలు వచ్చి మానవుల కరచును అందున
కొందరు చచ్చెదరు బలవంతమైన సంసారములు చెడి నిస్సారవంతమై
పోవును. ధనవంతుల ధనము ధర్మానికి వినియోగపడక అనర్థముగా
జీర్ణమైపోవును. రాచ స్త్రీలకు సంకటికలుగును సకల చరాచరంబులకు
సంతాపంబులు పుట్టును. మహోత్పాతంబులు నలువంకల వినంగలుగును
ప్రజలు పర భూములు చేరుదురు. ఇందుకు సందియములేదు. ఇట్లే
అనేక ప్రళయంబులచేత ప్రజలు నాశనమగుదురు. శ్రీ వీరభోగవసంత
రాయులీ భూమండల మంతయు నేక చక్రాధిపతిగా పాలించుటకు వచ్చే
ముందీలోకంబున యనేకక్షుద్ర శక్తులు వచ్చును, ఆశక్తులు భూలోకం
బున అనేక నష్టకష్టంబులు కలిగించును ధనవంతుల కమిత చెడు గుణ
ములు పుట్టును. అది వారి కనర్థకంబని తెలిసేది జలములయందు
మంటలు మండేను భక్తులైన వారికి అనేకమగు కష్టంబులు గలిగి
యుండేను జితేంద్రియుల నెత్తురు భూమి మీద నేతీరున బారునో
యాతీరున భూభార మడంగును అనేక వేల గ్రహంబులు శ్మశానంబై
పోవును జగ్గయ్యపేట యందున్న లక్ష్మి తొలంగును పంచ వన్నెలుగల
చుక్కలు పుట్టేను. అప్పుడు దేశంబున ననేకంబులైన కీడులుగలిగేను
ఆదే మీకు విధానము మరియు మొగలాయి రాజ్యములో కనిగిరి గ్రామం
బున ముసలి బ్రాహ్మణుడు బాలస్త్రీ యగును అప్పుడు ఆ దేశమునకు
నమితంబైన కళలు గలుగును మరియు పగలు నెఱ్రని నక్షత్రములు
గానంబడును అవి తిరిగి రాలును అప్పుడు జ్ఞానులైనవారు కనకంతో

వాలలాడుదురు అదియే మీకు విధానము కాశిలోనుదకము నలు దినంబు లెండిపోయి మంటలు మండును. అప్పుడా దేశమందొక వి బుట్టును ఆ దేశములోని ప్రజలందరు చాలా కష్టముల పాలగుదు రాజరాజులకు వైరంబులు బుట్టేను అది వారి నాశనమునకని తెలి చంద్రుని రూపము హరించును నీతిమంతులు నిజము చూచెదరు దుష్ట నశించుదురనియు తెలసేది.

ఇదియునుంగాక కాలజ్ఞాన గోవింద వాక్యములను గ్రంథము (326) చరణములతో భవిష్యత్తు ముగించబడియున్నది. అందు కొన్ని చరణములు నిచ్చట వ్రాయబడుచున్నవి.

# గోవింద వాక్యములు

1. ఈశాన్యమూనుంచి విషగాలి వచ్చిని
విపరీతజనులంత జచ్చేరు మా ॥ గోవిందా గోవిందా ॥
కపటకిరాతకుల ఖండించివేయును ॥ కాలికావతారుడు వచ్చే సుమా ॥
హరిగోవింద గోవిందా శివగోవిందా ॥

2. పొగరు బోతులంత భావిష్యమంతయు బూటకమని బల్కుచుండేరు మా ॥ కాగల కార్యముల్ కనురెప్పపాటులో జాగులేక భువిని జరిగేను మా ॥హరిగో॥

3. వుల్లిగడ్డలాకు వుపదేశమిచ్చేటి కల్లగురువులు కలిలో నుండే రుమా ॥ కల్లగురువులనెల్ల కాలదన్నునుయముడు కల్లలేని నరుల కరుణించాను మా ॥ హరిగోవింద ॥

4. ముండ మోపులంత ముత్తైదులయ్యాని ముందొచ్చెగతి మీకు దెలిసిని మా ॥ బండాటలాడేటి పాపిష్ఠి నరులంత పండాకురీతిగా రాలేరు. మా ॥ హరిగోవిందా ॥

5. గ్రామాలుపల్లెలు పట్నాలన్నియు గ్రిహపీడనేతను పాడై పొయ్యాని మా ॥ కామము క్రోధాము బహుమందమయ్యాని కాసుకొరకు కలహమయ్యాని మా ॥ హరిగోవిందా ॥

6. కోమటివారెల్ల కులభ్రిష్ఠులయ్యేరు గొప్ప పట్నాల్కొల్లబొయ్యావిమా ॥ క్షేమాములేకాను పాంచానకులబుధులు పామారులై వూర్లు తిరిగేరు మా ॥ హరిగోవిందా ॥

7. నెల్లూరుసీమంత నిర్మూల మయ్యీని నిడుగర్లు నిర్ధూళి అయ్యీని మా కల్లూరినపెరిగి గాజారులయ్యీని ఖుల్లాసాహేబుల మణిగేరు మా ॥ హరిగోవిందా॥

8. కోమటిరంగాని రక్షించేరుబాలి కోరిన కోర్కెలు యిచ్చేరు మా • కడమ కోమట్లను ధూళిగ జేసేరు కొంచమైన నిలువ నియ్యరు మా ॥ హరిగోవిందా ॥

9. మబ్బుమాయలబడి దబ్బరనాడేరు మబ్బునడతలు బహుగ నడిచేరు మా • గొబ్బున వారెల్ల నాశనమయ్యేరు గుణవంతులీ భువిన నిలచేరు మా ॥ హరిగోవిందా ॥

10. గురులింగ జంగాలు గురుతుదెలియలేక గుర్రిడ్డి కుక్కలవలె మొరిగేరు మా • మొరిగి మొరిగి వారు వాదుకురాకుంచే వరగబెట్టివార్ని తర గేరు మా • ॥ హరిగోవిందా ॥

11. పన్నెండుపుట్లంత గాజులుపగిలీని మొలపోతుగు రక్తము జారీని మా • పృధివిలో దైవమువేదన్న వారెల్ల వడ్లపొట్టువలె రాలె రాలేరు మా ॥ హరిగోవిందా ॥

12. ధనసుమీద గురుడు ప్రవేశమైతేను ధనువుచేతనుహారుడు బట్టేను మా • మనస్మిఖ హారణుడుపాశు పశాస్త్రమమనవీరయోగికి యిచ్చేను మా ॥ హరిగోవిందా॥

13. భాగవతములోను శుకయోగిబల్కిన భావికాలముదృష్ట మయ్యీని మా •. మాఘబహుళమందు మావారు వచ్చేరు మహిమీద సంగ్రామము లయ్యీని మా ॥ హరిగోవిందా ॥

14. మున్నూరువారెల్ల ముదముతో నుండేరు మొగలాయి దొరతనము లణగివి మా • పెన్నయొడ్డునయుండే చెన్నూరు గ్రామము పెనుగొండసీమకు జేరేరు మా ॥ హరిగోవిందా ॥

15. కన్యారాశినశని ప్రావేశమైతేను కమలనాభుడుపపైన మయ్యానిమా • సన్నజాజులవాన సాయంత్రమునందు శతమన్యుడు గురిపించీని మా ॥ హరిగోవిందా ॥

16. యేనూరుకోట్ల భూమండలాములోను పొట్టుపోయిగట్టి నిలచీనిమా • యేడూర్లకొకవూరు ఏకాంతమయ్యోని యే కాంగులు అరుదయ్యేరుమా• ॥ హరిగోవిందా ॥

17. భానుబింబమునందు విష్ణురూపము జూచి భక్తులు సంతోషమయ్యేరు మా • పూని పౌర్ణమినాడు అమావాస్య అయ్యోని పూలవర్షమూలు గురిసీని మా ॥ హరిగోవిందా ॥

18. భారతభూమిని పరిపాలనము సేయ పరదేశవాసులు వచ్చేరు మా • ఆరువత్సరములు ఏకరీతిగ అంబనొక్కతె అవని నేలును మా • ॥ హరిగోవిందా ॥

19. మీనమందునగురుడు ప్రవేశమైతేను భానుతేజాను పట్న మెక్కిని మా • భానుమండలపతి పాలించు జగమూలు భాగ్యాము భక్తుల కిచ్చేని మా ॥ హరిగోవిందా ॥

20. జలమూలు ఇంకీని జగమూలు వణకీని జనులుకొందరు నష్టమయ్యేరు మా • ఆలవిగానిదండు అర్థాముకొంకయ్యె అనె గొంది జేరవచ్చేరు మా ॥ హరిగోవిందా ॥

21. జాతిజాతికి చాల వైరముల్ గల్గిని జనయోగము తల్లడిల్లీని మా ॥ పెన్నయొడ్డున యుండె చెన్నూరు గ్రామము వరదల పాలయ్యి పొయ్యేని మా ॥ హరిగోవిందా ॥

22. ఉత్తరాదిజనులు దక్షిణ ముఖులయ్యి ఉత్తరాయణమందు వచ్చేరు మా ॥ కత్తికత్తి పరచి ఘనయుద్ధమయ్యేని కనిభూదేవియును వణికేను మా ॥ హరిగోవిందా ॥

23. ఆకాశవీధిన రాకాశిపంపూలు కేకవేయుచును దుమికేరు మా ॥ చీకాకుపడినటుల జడమతుల్ జచ్చేరు శమనూని దూతలు వచ్చేరు మా ॥ హరిగోవిందా ॥

24. నక్కాలు పూర్వార్ల దినమందుగూసిని కుక్క మూతిన తోక బుట్టీని మా ॥ ముక్కులుకోసేటి వానిరాజ్య జనులు మక్క పురికి వారు బొయ్యేరు మా ॥ హరిగోవిందా ॥

25. మద్దపాటివద్ద మునుచెల్లగూడేరు పెండ్లికొడుకులు అచటి కొచ్చిని మా గుండెల్లదేలిని బెండ్లెల్లముచిగిని కుంభిణీభారాము లణగీని మా ॥ ॥ హరిగోవిందా ॥

26. వారాధులింకీని వసుధపొడయ్యేని తారాలు భువిమీద రాలేరు మా ॥ వీరాధివీరుల వెంటబెట్టుకొని వీరవసంతూడు వచ్చేను మా ॥ ॥ హరిగోవిందా ॥

27. పర్వతేంద్రమున వుత్పాతాలుబుట్టు పార్వతి చిరునవ్వునవ్వీని మా ॥ మర్వాస్వీజమాస కృష్ణపక్షమందు పంచాంగమూలేక బొయ్యీని మా ॥ ॥ హరిగోవిందా ॥

28. దాసూలమనుకొని గీసూలమనుకొని దండములు బెట్టుతు తిరిగేరు మా । దండాముబట్టిన తావుదెల్పుమని గాసుల బహాబాధ బెట్టేరు మా॥ హరిగోవింద॥

29. శీలవంతుల బట్టి శిగలెల్ల ముడివేసి చింతకొమ్మలకేల దీసేరు మా । శీలాముబట్టిన తావుదెల్పుమని చింతామెల్లెల పాలుజేసేరు మా ॥హరిగోవింద॥

30. శతయాపరాధములు జేసినవారైన శరణన్నవార్ని రక్షించేరు మా । పతితపావనూడు భానుమండల పతి భక్తుల రక్షించ వచ్చీని మా ॥హరిగోవింద॥

31. మందార ధరుడైన సుందారాంగునిమహిమ మహీమీద యవరూను యరుగారు । మా సందేహమూలేదు సామగానపిప్రియుడు సాధుల రక్షింప వచ్చేను మా ॥హరిగోవింద॥

32. యేనూరుకోట్ల భూమండాలమంతాయు యేకచక్రముగ యేలీలి మా । భానుమండలమందు ఉద్భావమయ్యాని భానునందు ప్రకాశించీని మా ॥హరిగోవింద॥

33. కాలపరిపక్వాము జనులాకు ముందర కార్తికమాసములో కలిగీని మా । బాలచంద్రుని కాంతి కానకబోయ్యాని భాను కాంతులణగి పోయ్యాని మా॥ హరిగోవింద॥

34. కమ్మన్న పనులెల్ల ఘడియాలొ అయ్యాని నమ్మిన్న హరి యిప్పుడొచ్చీని మా । ముమ్మాటికీమాట నమ్మిన్న వారికి మూకందుదూ భాగ్యమిచ్చీని మా ॥హరిగోవింద॥

35. ప్రేమతో వీరవసంతూని వెంబడి పెద్దలెల్ల తర్లి వచ్చేరు మా సోమసిద్ధాంతాము సొంపుగ నడచీని శుభ శోభనాములు అయ్యా మా ॥ హరిగోవింద॥

36. కేశవూని పెండ్లి కి ర్తిగజేసేరు ముత్యాల తలంబ్రాలు బోసే మా । కేశవూని వశము దేశాలన్ని యుజేసి దేశాలవారికి వ్రాసే మా ॥హరిగోవింద॥

37. పచ్చాలపల్లకి లోపల గూర్చుండి పద్యానాథుడు తర్లి వచ్చేని మ ముచ్చట లాడుచు ముత్యాల డోలిలో లచ్చమ్మ గూర్చుం వచ్చీని మా ॥హరిగోవింద॥

38. సీమాముదప్పిన నామధారులెల్ల సీటికన్నను పలుచనయ్యేరు మ సామాజ వరదూడు వచ్చేటప్పుడు సందు గొందూల యందు దూరేరు మా ॥హరిగోవింద॥

39. కాలాము వచ్చీనదనక యీ మాటాలు కల్లలాని జనులు గూసే మా । కాలాము మొదలు ఆషాడానికొచ్చీని కల్లలెల్ల నిజవ లయ్యీని మా ॥హరిగోవింద॥

40. తల్లూలు బిడ్డాలు తగువూలు నడచీని తల్లడించే దినములొచ్చీ మా । కల్లగాదీమాట యుల్లాము సాక్షిగ గద్దానొడిసి కాకిగన్నీ మా ॥హరిగోవింద॥

41. ఉత్తార దేశమున సత్తూగ ప్రజలంత కత్తులాతొ వేడలాడేరు మా ఉత్తమాటలు గావు నదీనదములుపొంగి వూళ్ళన్ని కొట్టు పొయ్యేను మా ॥హరిగోవింద॥

42. కాశిలోను గంగస్నానముజేసేరు కార్యములెల్ల గల్గిని మా। నాసికాగ్రిమందు చూచేటి వారికి వ్యాసుల దరిశాన మయ్యీని మా ॥హరిగోవింద॥

43. భేరి కోమట్లెల్ల జయమూన వుండేరు పెద్దాలు కొందారు యుండేరు మా। ధరణిమీద ధర్మాత్ముల గుర్తెరిగి దయతోను చాల రక్షించేను మా ॥హరిగోవింద॥

44. ఘనమైన వజ్రాలు యాగంటి కొండన గాడికంచుకముతో దెచ్చేరు మా। దినకర తేజూడు వజ్రాలు దీయించి దేవబ్రాహ్మణులకిచ్చీని మా ॥హరిగోవింద॥

45 ధనమూలు దీయించి ధర్మములు జేయించి ధర్మరాజులు భూమి యేలీని మా। దానధర్మము లేక దాచీన ధనమంత దండిగ భక్తులకిచ్చీని మా ॥హరిగోవిందా ॥

నీళ్ళలో స్త్రీలు యాలలుపాడేరు ఆ స్త్రీల కన్నులలో రక్తవ కారేను. తండ్రియని గాని అన్నయని గాని తమ్ముడని గాని జూడ విరహావేదనచే వావివరుసలు లేక నడచేరు. ఒక్క మొగవానికి పదు గురు స్త్రీలు వెంబడించేరు. అప్పుడు మానవులకు వింతవింతల గుణ ములు బుట్టేని రాతిగుండ్లలో చీము నెత్తురు వచ్చేను, బండలు పగి ఆకాశమున గ్రద్దలవలెను, కాకులవలెను ఆడేరు. పర్వతంమీద ఉక్కు స్థంభముపైన వున్న ప్రతిమ మాటలాడేను. నక్కలు జాముజామున కూసేను ఇందున కొందరు జనులు వియంబయ్యేదరు. తూర్పునుం పడమర వరకు ఆకాశంబున యోజన ప్రమాణము వెడల్పుగ చెంగా చీర కట్టినట్లు కనబడేను గోదావరి నదియందు పన్నెండు దినము ఉదకము సమసిపోయేను అవన ఉప్పొంగేను. శ్రీశైలనాధుండు సా త్కారముగా వీరభోగవసంతరాయులు వస్తాడని చెప్పేను. అప్పుడు ర వర్షము కురిసేను. ఈ వింతలన్నియు నేను కలియుగంబున వీరభో వసంతరాయుండనై వచ్చువరకు జరుగుచుంఉను. దుష్టనిగ్రహ పరిపాలనమునకై నేను వచ్చుటకు ముందుగా బెజవాడ జేరి అచ్చ వారిని నాకు వశ్యులుగ జేసుకొనియెద. ఇంకను అనేకములగు వింత జరుగనున్నవి మరియు సమస్త దేశంబుల వారికిన్ని చెడు దినంబు సంభవించి నాగుమల్లె నశించెడు విధంబున మానవులు నశించెడు దిన ములు పరుగిడి వచ్చుచున్నవి. అనేక వేల గృహంబులు యజమా లెవ్వరు లేకుండుటచే భిన్నములై పోవును. మరియు నా మఠమున ఈశాన్య భాగమున భూమియందు పాంచాననము వారింట ఒక చి దాని గర్భంబు బ్రద్దలుగా పగిలి చిన్నవాడు ఉత్పత్తి అయ్యేను. కాలమందు అపరిమితమైన ఉత్పాతములుగా ఉలుములు మెరుప పుట్టును; అందున కొందరు నష్టమయ్యేదరు.

ఆ చిన్నవాడు దేశముమీదికి వచ్చి నేనే భగవంతుడను నన్ను బూజించుకొనిన మీకు ముక్తి కలుగునని చెప్పేను. భక్తులైనవారు నమ్మకుండేరు. ఉత్తరాదిన ఒక మఱ్ఱిమాను తొఱ్ఱలో నుండి ఒక మహాత్ముడు నెత్తిన కొమ్ములతో పుట్టే సమయంబున చెట్టు చీలికలుగా పగిలి బైటికి వచ్చును. ఆతను దేశము మీదికి వచ్చి నేనే భగవంతుడను నన్నునమ్మి పూజించుకొడని చెప్పేను. భక్తులైనవారు నమ్మకుండేరు. పడమటి దేశమునుండి ఒక చింతమాను తొఱ్ఱలో గుండా దిగంబరు రూపంబుగా ఒక మహానీయుడు వచ్చేను. దక్షణ దేశంబునకు ధీరుండనని బల్కేను. ఈ ప్రకారముగా నలుదిక్కుల నలుగురు ఉత్పత్తియై వచ్చేరు. మరియు మక్కామసీదులో ఒక వరహంబు బుట్టి మహమ్మదీయులందరకు వైరంబు బెట్టును. ఆ వైరము చేత ఒక్కొక్క యింటిలోనికి మూరేను. వీరిలో వీరికి అన్యోన్య కలహములచేత చంపెదమని వచ్చేరు. ఆ వచ్చినవారికి చిక్కినట్లుగానే యుండి చిక్కకుండ బెజవాడ కృష్ణవరకు తీసుకొని వచ్చేను. అక్కడ అదృశ్యమై లక్షోపలక్షల జనాన్ని హతముజేసేను. అప్పుడు నూరుపుట్టి నల్లులు రాలేను. ముత్యాలు, పగుడాలు కాసుకు అమ్ముడుబోవును యిత్తడి రాగి యినుము తొలంగును. విభూతి వరహాకు ఎత్తెడు అమ్మను, నారాకడకు ముందు పౌర్ణమి అమావాస్య అగును ప్రతివారును నిరీక్షించు చుందురు? అందున కొందరు నశింతురు తిరుపతి కొండమూలగా ధూమకేతువనే నక్షత్రము బుట్టేను ఆ నక్షత్రమును జూచి మిట్టమధ్యాహ్నపు వేళ్ళ అనేకమైన కీలాభీలాలు గలిగి జనులనేకులు దిగులుపడి చచ్చేరు. సందేహములేదు. ఊర్వియంతయు తారుమారయ్యేను జితేంద్రియులు కానివారల నెత్తురు భూమిమీద నేతీరునవారునో యదేతీరున భూభారము అణగిపోయేను. భూమియంతయు రక్తయమయ్యేను. నన్నునమ్మి స్మరణజేయువారలు నదులను నిలువుమంటె

నిలుచును. మరియు నారాకడకు ముందు నా భక్తులగు వారలు వారివా సామర్థ్యములకొలది ధర్మముల స్థాపించి ధర్మ పరిపాలనకు చక్ర జేసెదరు. పిమ్మట లోకమంతయు ధర్మ సమృద్ధియగును. ముం జరుగబోవు కార్యాలు సామవేద ఘోషణములలో గనపడుచుండున ఈశ్వరమ్మగారిని రంగరాజుకిచ్చి వివాహముజేసేవరకు కందిమల్లం పల్లె నవరత్నముల మంటపంబులలో నుండి పన్నెండామడ పట్ట మగును. నా భక్తులైనవారు యావన్మంది యక్కడకు వచ్చి కల్యాణవ జూతురు యిదే మీకు నిధానము.

ఇంకను నీయుర్వియందనేక యుత్పాతంబులు బుట్టుచున్న: తిరుపతి వెంకటేశ్వరుని గుళ్లో మొసళ్ళు జొరబడి మూడు దినంబుల పూజలేక తలుపులు వేసి యుంచేరు. మేమువచ్చు కాలమునకు భూ: యందు అద్భుతముగా జలముబుట్టేను లోకమంతయు తల్లడించేను, కృ వేణి యుప్పొంగి కనకదుర్గ ముక్కుపోగు అంటుకొనును పాతాళ గంగులో శాపముచేత పచ్చబండయై పడియున్న చంద్రగుప్త మహ రాజునకు కలికావతార పురుషుని పాదమునోకి శాపవిముక్తుడగున మరియు సమస్త జనులు అష్టకష్టముల పొలగుదురు. అరకాలి మం నెత్తికెక్కును. రాజాది రాజులు అడుగంటి యొదిగియుందురు శూద్రుల కేళివిలాసముగా నుండేరు. మాయయును ద్రవ్యంబును గురించి న్యాయవ దెలిసికొనలేక అన్యాయంబుగ చెడిపోదురు. ప్రపంచంబంతయు ఏక త్వంబై ధనవంతులు దరిద్రులై గుంట మిట్ట సమానంబగును మరియ ఆకాశమందు విషగాలి పుట్టి ఆ గాలివలన మాయరోగాలు గలిగి జనుల కులు నశించేరు. పుణ్యభూమియైన ఈ భరత ఖండంబుననే గాక ఇతర ఖండంబుల స్థితి జెప్పనదేమున్నది. అనేక మహోత్పాత ప్రమాదము

వింతలున్ను మరియు నానా వ్యాధులున్ను అద్భుతమగు శక్తులయొక్క గోలలున్ను జరుగును. నేను వచ్చునంతలో నెన్నియో వికృతములు బుట్టును. ఇట్టి తహోత్పాతాది కారణంబులచే (7) ఏడుపాళ్ళ జనులు నశించుదురు. గాని ఇప్పటినుండియే సర్వేశ్వరుని నిశ్చలమైన మనస్సులో నిరంతరము స్మరించుచుండుడు. మీకేవిధమైన భయంబును గలుగదు. భయముగలిగిన వెనుక బ్రహ్మమును గనలేరు మరియు తిరుపతి వేంకటేశ్వరుని సముఖమున ఒక విష్ణుభక్తుడు బుట్టి శివా యనే పదము (8) ఘడియలు లేకుండా జేసేను ఆదివిష్ణువు లోక రక్షకుండై యుండగా ఎక్కడి శివుడు ఎక్కడి బ్రహ్మ యని విష్ణుభక్తుడనెను. అంతట విష్ణుభక్తులకు శివభక్తులకు జగేది తర్క వాదమేమనిన శ్రీవిష్ణు పాదోదకమని విష్ణుభక్తులును, శ్రీశంభు పాదోదకమని శివభక్తును ఇట్లు తర్కవాదము జరిగెను. ఈ తర్కవాదము చేత శ్రీశైల పర్వతానికి బోదురు. నా భక్తులైన నపాంచాననము వారు ఇన్ని దినంబులు బ్రహ్మముగారి భక్తితో నుండి ఈ దినము చెదిరేకంటే బ్రహ్మముగారి మఠములో సమాధివద్ద సహసముచేత చచ్చినదే మేలని భక్తులు ఆలోచించుచుండగా అమావాస్య రోజున చంద్రోదయమయ్యేను. ఆ చంద్రోదయము చూస్తువుండగానే అనేక విరక్తులు గలిగేను. వీరసాహసులైన వారప్పుడు వీరకాసేలు గట్టి నామఠముదగ్గరకొచ్చేరు. నా మఠములో ఆరెదొండతీగ బుట్టి ఒక్కరాత్రి ఏడు ఘడియలకు మఠమంతా అల్లుకొని మనుష్యులు లోనికి వెళ్ళుటకు వీలులేకుండా వుండి (7) ఏడు దినములు పూజ లేకుండా వుండేను. ఇదిచూచి నా భక్తులైనవారు వీర సాహసముచేత వాతీగెనంతా ఖండించి బయలుచేసి లోనికిపోయి లక్షా పదకొండు వేల అయ్యలు గండకత్తెరలు మెడకు వేసికొని హరహరాయని మృతి బొందేరు.

నా భక్తులైన వారకి యప్పటికప్పుడే నిదర్శనము కనబడుచుం డును. ఇదియునుంగాక పర్వతంమీద జరిగే తర్కవాద మేమనగ విష్ణుపాదోదకమని విష్ణుభక్తులును, శ్రీకంఠు పాదోదకమని శివభక్తులను తర్కవాదములు జరుపుతు వుండగా ఈ తర్కవాద రోదనలకు పెద్దలై ఋషులచటికి వచ్చి ఇరువురి తర్కములను విని ఆ ఋషీశ్వరులు ఓ భక్తులారా ఈ విధముగా మీరు తర్కవాదము చేసుకొనిన ప్రయోజ నములేదు. కావున మేము ఒక న్యాయము జెప్పెదము మీరు విష్ణుభక్తులు, వారు శివభక్తులు మీ వుదకమైతె మీరు తీసుకొని వెళ్ళండి. వారి వుదక మైతె వారికివ్వండి. ఇట్లు చెప్పిన ఋషుల వాక్యములకు సంతోషించి అంతట విష్ణుభక్తులకు శరీరమునిండ నామములుబెట్టి పాతాళగంగలో గూర్చుండబెట్టేరు. ఆ వుదకము విష్ణుభక్తులకు వశముగాకపొయ్యేను, అంత నా శివభక్తులు ఈ వుదకము తీసుకొనుటకు మీకు నలవిగాలేదు, కావున మేము తీసుకొనెదము. రమ్మనమనిన విష్ణుభక్తులు బహు లజ్జపడి పాతాళగంగలో నుంచిన విష్ణుభక్తుని లేవదీసి అప్పుడు శివభక్తునకు శరీరమునిండ విభూతిబూసి పాతాళగంగలో గూర్చుండబెట్టేరు. అంత నీటియందు కళపెళ కళపెళమనె ధ్వనితోగూడి ఓం ఓం అనే శబ్దము పుట్టేను. అంత సప్త సముద్రములు నదీ నదములు పొంగి వాగులు, వంకలు చదరమై అండపిండ బ్రహ్మాండములలో వుండే పిపీలికాది జీవరాసులలో వుండే జలమున్ను భూమియందు సప్త సముద్రములలో నదీ నదంబులలో వుండే జలమున్ను మానవుల శరీరములో వుండే రక్త మాంసాదులతో సహా ఒక్క జాములో నింకిపొయ్యేను. అప్పటికి భక్తు లైనవారు వత్తులై నిలచేరు. అప్పుడు ముప్పది రెండు వాయిద్యంబులు వినంబడేను. సూర్య చంద్రాదులు దిశలు దప్పేరు. భూమియంతయు కుమ్మరిసానవలె గిరగిర దిరిగేను. ధరణీతలంబు తలక్రిందు లయ్యేను.

అప్పుడు సమాధిని పటపటా పగులగొట్టుకొని శ్రీ వీరభోగవసంతరాయులు రక్తవసంతము లాడుచు వచ్చేను.

ఇది నాదబ్రహ్మము వలన బుట్టిన వాక్యములు ఇందొక యక్షరంబైనను పొల్లుగాదు.

ఉ॥ తీరనివ్యాధులున్ను నతితీవరమౌవిషయుక్త వాయువుల్
మీరుజలాగ్నిరక్తమగు మిక్కిలి వర్షములున్నుపిడుగులున్
ధారుణి రాజయుద్ధములు ధర్మవిహీనుల రాక్షసత్వముల్
ఘోరములయ్యె రాలుదురు క్రూరులు మూలవిహీనులయ్యెలన్॥

ఈ లాగున జననష్టమై ప్రజలు మిక్కిలి గాసిజెంది ఆకు రాలిన చందమున రాలిపోదురు. మరియు ఏడు గ్రామంబులకు నొక్క గ్రామంబగును ఏడు దొడ్లకు వక్క దొడ్డియగును, ఏడు యిండ్లకు వక్క యిల్లగును భూమిమీదనున్న దుర్జనుల ధనము యావత్తు శ్రీశైలమునకు చేరును. పుణ్యస్త్రీ పురుషులకు భక్తి పుట్టును పాపాత్ములకు చింతలు పుట్టును ఇందుకు సందేహయము లేదు. ఈ మహా భవిష్యత్తును అబద్ధమని అపహాస్యము చేతను ఎగతాళి దూషించిన దుర్మార్గుల నోటి వజ్రదొండ పురుగులు యోగినీప్రళయాంతక శక్తులవలన అనేక విధములగు హింసలు జరిగి ముక్కలుముక్కలుగా కోయంబడి నశించుదురని ఎరుంగుడు ఇది వీరగురు వాక్యము తప్పదని తెల్యుడు. గట్టిగా మానవులు మగ్గేరు అష్టాదశ వర్ణముల వారెవరైనను ఇకనైన బ్రహ్మజ్ఞానము తెలుసుకొని మడిమైలయను నీమంబులేక బీజ సంపుటితోనున్న మాయొక్క మూలతంత్రమగు ద్వాదశాక్షరియైనను మరియు అష్టాక్షరియైనను పరె నిష్ఠతో నిరంతరము సర్వకాల సర్వావస్థలయందు భక్తిచే జపించుచుండిన సత్వకోరికలు దీర్చి ఇహపరసౌఖ్యంబు లొసంగె

దరు సత్యము మానవులారా మరువకుడు మరచినా మహోత్పాతంబు లనేకంబు రాబోవుచున్నవి మాయొక్క ద్వాదశాక్షరిని నిష్ఠతో (12000) పదిరెండువేలు జపించువారికి తప్పక దరిశన మొసంగును మరియు ముందురాబోవు మహోత్పాత ప్రళయంబులు శక్తులవలన గలుగు ప్రమాదంబులు వారిని నంటజాలక వారి గృహంబులకు జేరపని మరియు సకలమైన పీడలు తొలంగి యఖండైశ్వర్య వంతులైయుండి వీర ధర్మంబు గాంతురనియు శ్రీ స్వాములవారు వ్రాసియున్నారు. ఇందు సూక్ష్మముగా వ్రాయడమైనది. ఇంకా అనేకములగు మహోత్పాతములు ప్రమాదంబులు జరుగబోవునని యున్నది మరియు నొకతత్వములో.

## -: తత్వము :-

1. రాక్షసకులము నీరుసేయ శ్రీగాములుజననం బైనాడు ॥
   అక్షయముగతాదివ్యత్సరంబందు ప్రకాశంబైనాడు .

2. శిక్షసేయ దుర్మార్గులమీదికి శక్తులబంపిస్తున్నాడు ॥
   యీక్షితిలోపల మానవకోటికి వింతలువిహరిస్తున్నాడు ॥

3. ఆకాశంబున ధర్మదేవతా ఆర్భటించునిజమన్నాడు ॥
   జోకతా ఆధ్వని లోకములో వినిచీకాకౌతుందన్నాడు ॥

4. మచ్ఛకులము మల్లాకులము ముచ్చటలుడుగునన్నాడు ॥
   నూటఎనిమిది ఏండ్లు కృతయుగ ధర్మమునడిపేనన్నాడు ॥

5. ముందుమార్గశిరఅష్టమిలోయుగ సంధిబుట్టు నిజమన్నాడు ॥
   యిందుకుదప్పిన హీనజాతి వానింగనె బుట్టిదనన్నాడు ॥

అని కాలజ్ఞాన తత్వములను గ్రంధమందు నొక తత్వములో వ్రాయబడియున్నది. వచన కాలజ్ఞానం బైనను సంపూర్ణ జీవిత చరిత్ర

లైనను కాలజ్ఞాన గోవింద వాక్యములను గ్రంథమునైనను చదివిన సంపూర్ణముగ విశదమగును యావజ్జనులకు మెలకువ గలుగుటకై కృతయుగము వేకువయగు చున్నదనియు నిద్రనుండి మేలుకొనుడని ఈ చిన్న పొత్తమును వ్రాయడమైనది.

పాఠక మహాశయులారా క్షమించుచుందురని ప్రార్థన.

శ్రీ స్వాములవారు కొన్ని ధర్మములనుకూడ దెలిపియున్నారు. ఆలకించదగు (ఏమనగా) తాము భోజనము చేయకముందు ఒకరికి అన్నము పెట్టుట ఉత్తమ ధర్మ మనంబడును.

భోజనము చేసిన పిమ్మట వకరికి పెట్టుట మధ్యమ ధర్మ మనబడును.

ఫలకాంక్షచే వకరికి అన్నము పెట్టుట అధమ ధర్మమనంబడును చాలకుండ అన్నము బెట్టుట అధ మాధమ ధర్మ మనంబడును.

గావున దానంబులన్నింటిలో అన్నదానమే శ్రేష్ఠమగును గనుక నీధర్మంబులను మనంబునందుంచి చేసిన ధర్మము శ్రేయస్కరమై యుండును మరియు మహాత్మ సర్వభూతాత్మయను శృతిని హృదయ మందుంచి సర్వేజనా సుఖినోభవంతు యని నిరంతరము సర్వజనుల సర్వజనుల యొక్క క్షేమమునే కోరుచు పరహితార్థులై సర్వభూత దయాళులై సదాదైవమును మానక మరువక ధ్యానించుచు అన్నదానము జేయుచు రాబోవు యోగి నీశ క్తులకు చిక్కక వర్తించు చుండుడవియు.

ఇయ్యది ఆత్మ రహస్యంబైన భవిష్యన్నిర్ణయంబుల వర్ణయు క్తంబుగానులిఖించి పంపిన సౌజన్య పత్రిక దీనిని బహు విశ్వాసం బున దినదినము పూజింపుచున్న ననేక దివ్యస్థలంబులలో మూర్తులను పూజించినంత ఫలమున్ను గలుగును కానయిది తప్పరాదు వేద వాక్య ములు నిదియ నిజంబగు, గంగా భవాని సర్వ కలుషంబులు హరించి

పావనంబు జేనట్లు నిదియుని పావనంబుజేయు బ్రహ్మానందము ప
పదం బొసగిసట్లే నిదియును పరమపావన అంజనంబగు ధరులైన
ఆనందుంతురు మత్తులైనవారు హాస్యంబుగా భాషించి మోస పోవు
గాన భక్తులారా మీరు భక్తి క్రియాజ్ఞానంబు గలిగి సద్భక్తులై శ్రీ
భోగ వసంతరాయుల వారిని చిత్తంబున నిలిపి సదా ధ్యానించుచు
ముందు అతి త్వరలో ప్రళయ కళంబున ప్రపంచము మీదికి రా
యోగినీశక్తుల వలన గలిగెడి మహోత్పాత ప్రళయంబువాకటియై
చెంతజేరక మిమ్మంట జాలవు. అట్టివారు ముందు వీర ధర్మంబు
జూడగలుగుదురు మరియును బీజసంపుటితో యున్న మాయొ
ద్వాదశరినీ నియమముగా (12000) పదిరెండు వేలు జపముజేయ
ఒక విభూతిపండును. కలశము నేర్పరచి పూజించి జపించువా
తప్పక నేను దర్శనమిచ్చెదనని శ్రీ స్వాములవారు వచించి యున్నా

(సో ద ర సో ద రీ మ ణు లా రా)

ఇంతటనైనా ప్రజలు గర్విష్టులు గాక నా మాటలు నిస్సారంబు
తోచివేయక మూర్ఖ్యంబును వదలి జ్ఞానంబును దెచ్చుకొని మనంబు
జంపి బుద్ధిని స్థిరపరచు కొనియు మడిమైలయనునను మానంబు
శ్రీ స్వాములవారు ఉపదేశించిన బీజ సంపుటియైనది.

శ్లో॥ గురుబ్రహ్మా-గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వర
గురుసాక్షాత్ పరబ్రహ్మం - తస్మై శ్రీగురువేనమః

( ధ్యా న మ్ )

శ్లో॥ వీరబ్రహ్మలలితం వీరప్రభావం - సురమునిసహితం - సూ
ఖండాంశుధారిం-రిపుగణహరం సద్భక్తరక్షాం త్రినేత్రం
పరశివగురురూపం భద్రకాళీ సమేతం భస్మంజ్యోతి స్వరూ
పాణ వీరబ్రహ్మ స్వరూపకర్మ - షడ్వింశతితత్వరూపం॥

తా స్మై శ్రీ గు రు వే న మః

(ఓం హ్రీం క్లీం శ్రీం శివాయ బ్రహ్మణేనమః)

యను ద్వాదశి మహామంత్రమైనను మరియు

(ఓన్నమో నారాయణాయ)

మరియు

(ఓన్నమో వీర నారాయణ)

యను అష్టాక్షరి మహామంత్రములైనను

సదా ధ్యానించుచు ఁ బోవు ప్రళయంబుల దప్పించుకొని కడ తేరుండని ప్రార్థన.

మరియు (లా ఇలాహ ఇల్లల్లాహ) యనునది కూడా అరబీ భాషలో అష్టాక్షరి యనంబడు ఇది శ్రీ వీరభోగ వసంతరాయుల యుత్పత్తికి కారణమైనది. ఈ కలియుగం నందు ప్రజలు ధర్మ శూన్యులై నాచార నియమంబులు వదలి క్రూరకర్ములై వర్తిల్లుచు మత్తు వస్తువులనే ముఖ్యాహారముగా గైకొనును ఎచ్చట జూచినను జారచోర వృత్తు లతిశయింపు చుండెను దేశమంతయు జ్ఞాన రాహిత్యమై సాధువు లకు నివసింప స్థలము లేకుండేను. అందుకు తపోనిష్ఠులును జ్ఞానులును తమ మహితలను దాచుకొని స్వాంతమున పరమేశ్వరా మాకు నీవేదిక్కు నీవెచట నున్నాడవో ఈ లోకమున నుద్భవించి మమ్ము రక్షింపుమని భగవంతుని బహు విధముల ప్రార్థింపఁ దొడగిరి కలియుగ మప్పటికి (1700) సం॥ గడచెను. తత్సమయంబున భూదేవియు శివ కేశవాతా రుండగు శ్రీ లక్ష్మీనారాయణ స్వామికి సాష్టాంగ నమస్కారములు జేసి, స్వామీ పరమపురుషా ఆదిమధ్యాంతరహితా అఖిలాండ కోటి బ్రహ్మాండ

నాయకా జగదీశ్వరా ఈ కలియుగ ప్రమాణంబు నాలుగు ల
ముప్పదిరెండు వేల సంవత్సరములు అందు నిదివరకు గతమైన
(1700) సంవత్సరములు యింతలో పాపము హెచ్చె పుణ్యంబు
మాత్రంబు లేక యున్నది. వోతండ్రి ప్రజలు నీతిదప్పి దుర్నీతు
అక్రమ ధనార్జితులై క్రూరకర్ములై విఱ్ఱవీగుచు వాని ప్రవర్తన ధ
లోపంబు గలుగ మద మత్తుచే ప్రవర్తించుచున్నారు.

సప్తకుల పర్వతంబులను సప్త సముద్రంబులను ధరియించ
కన్న ధర్మము దప్పినవారి మోచుట నాకు గడు భారంబు గాన
పాపభారం బోర్వజాల ననియె నంత నారాయణుండు శంకర బ్రహ్మ
లను సప్త ఋషులను సమస్త దేవతలు మొదలగు వారిని జూచి మన
ఈ లోకమందు భూమి పరిపాలనము జేయుటకు నుద్భవించెవ
ఈ కలియుగము మహాపాప యుగము గనుక దేవ రూపములు దాల్చ
నర రూపంబులు ధరియించి పుణ్యస్థలంబులందు నిలచి దుష్టజనని గ్ర
శిష్టజన పరిపాలనము జేయవలయును. మీరు మీ మీ యంశంబు
భూలోకంబున నాకు భక్తులై యుద్భవించుచుండని యాజ్ఞాపించు దు
దుర్మార్గుల సంహారమునకై కనక దుర్గాంబను పుట్టించి వారి వారి త
తమ స్థానములకు పొండని సెలవిచ్చి అవతారములు దాల్చినార
విభవిష్యత్ కాలజ్ఞాన గ్రంథముల సూచనలు........................

**నేటికాలము అధర్మ ప్రవర్తనము చేత జనులందరు ధర**
**విచారమును ఆత్మ విచారమును విడచి నిరంతరమును పొట్టవిచారములో**
**మ్రగ్గుచు ధన కాంక్షచే దుష్కృత్యము లొనర్చుచు అన్యాయార్జితంబగ**
**ధనధాన్య సంపద్గర్వమున రాజ్య మదమున విద్యా మదమున బడిపోవు**
**మద మాత్సర్యములచేత జగత్తున అధర్మములను వృద్ధిపరుచున్న**

దుర్మార్గులు హెచ్చి యున్నారు. కావున అధర్మం బెక్కువై ధర్మంబు నశించు నపుడెల్ల ధర్మోద్ధారకమునకు పరమాత్మనిచే యొక అవతారము నిలిచి దుష్టనిగ్రహాశిష్ట పరిపాలనము చేయుచు అధర్మమును తొలగించి సద్ధర్మోద్ధారకముజేసి ధర్మ రాజ్యము నిలిపి జనులందరకు బ్రహ్మ జ్ఞానము గలుగజేయుచు శాంతి వుత్పన్నము గలుగజేయుననియు ఇట్టి కాలమును గురించి మహాత్ములగు పెద్దలు ప్రళయ కాలమని నిరూపించి యున్నారు..........................................

ధర్మ స్థాపనము యగునంతవరకు విరుద్ధములచేత అనేక కలహములు యుద్ధములు మొదలైనవి కలుగుచునేయుండు ననియు ఇందులో చాలా జన నష్టముండు ననియు శ్రీ వారి తీర్మాణము.

కలియుగము (5052) సరియైన ఖరనామ సంవత్సరములో పుష్య శు॥ 3 లు సోమవారము శ్రవణ నక్షత్రము పగలు శ్రీ వీరభోగ వసంతరాయుల పట్టాభిషేకమని వున్నది. నాటి దినమున పరిపాలనము జేయు రాజుగారే శ్రీ వీరభోగ వసంతరాయులు మరియు కలియుగము 5053 సరియైన నందన నామ సంవత్సరమునకు కలియుగము సంపూర్ణ ముగా అంతరించి సత్యపరిపాలన ఏకసకాధి పత్యము వలన కలికి భగవానుడనే శ్రీ వీరభోగ వసంతరాయులు ఆదిలక్ష్మి సమేతుండై భక్తానందముతో కృతయుగ ధర్మపరిపాలన జేయుచుండును. శ్రీస్వాము లవారు పరిపాలన చేయునది (108) నూటాయెనిమిది సంవత్సరములు అని యున్నది..........................................

మరియు కృత యుగములో ఆశ్వీజ శు॥ 1 లు దినమే సంవత్స రాది యగును. ఇంకా కొంత కాలమునకు వ్యవసాయములు కూడా బొత్తిగా మారిపోవును. ఫల దుంపల భక్షణయే జరుగు చుండును సామ

వేద ప్రామాణములు గాంచిన విశదమగు ననియుని శ్రీ సిద్దప్ప వరక
రాజయోగిగారిచే విరచితంబగు కృతయుగ ధర్మమను గ్రంధమంద
వ్రాయబడియున్నది సంపూర్ణముగ చదివిన విశదమగును.

## ( శ్రీ సాములవారి మరి యొక యానతి )

ఏమనగా ఈ కాలజ్ఞాన గ్రంథమును ప్రకటన చేయువార
దలును సకల సౌభాగ్య సంపదలనంది సుఖించుదురు. పత్రిక వ్రాయ
టకు పాలుమాలి యుండు దుర్విష్ఠులకు సకల పాపంబులు సిద్ధించును
ఈ గ్రంధమును రహస్యముగా దాచియుంచి యిందలి భవిష్య ద్విష
యంబు లెవ్వరికిం దెలియ జేయక గర్వించి యున్న వారి నోటియందు
వజ్రదొండ పురుగులుపడి శక్తులచే యనేక హింసలు జరిగి నశించుదురు
మరియును వీరభోగ వసంతరాయులుండే క్రమము జెప్పెము సువ
ఛాయబోలినవారు విభూతికలు వలు ధరించినవారు యోగదండం బట్టి
వారు కాషాయాంబర వస్త్రంబులు ధరియించినవారు వజ్రాల పాదుకల
దొడిగినవారు మూలబ్రహ్మమతండు ఆ పుణ్యపురుషుండు (108) సం
త్సరంబులు రాజ్యపరిపాలనంబు జేయును. వారి సాంప్రాదాయకమ
వారు (1000) వెయ్యి ఏండ్లు పరిపాలన జేయుదురు. ఇందుకు సం
హములేదు.

మరియు కాలజ్ఞానంబును దెచ్చి చదివిన యయ్యగారికి దమక
గలిగి నంతలో సంభావన నొసంగి భోజనమైన పిదప జదివించుకొ
యీ కాలజ్ఞానమునకు సద్భక్తి పూర్వకంబుగా పూజల సలిపి యుత్స
వంబుజేసి చదివిన భక్తునికి మరియాదలు జరిపి యూరివెలుపలి కేగ

నంత వరకును దోడుకొని వచ్చి సాగనంపించి రావలయును ఇటుల సద్భక్తి సహితంబుగనున్న వారికి ఏవిధమగు పీడలు దగులవు సుఖంబుగ నుందురు వారిని శ్రీ వీరభోగ వసంతరాయులు రక్షించి మోక్షం బొసంగును.

తే॥ గీ॥ వినుడి జనులార బ్రహ్మంబు విశదపరచు
వాక్యములు పొల్లువేయని వసుధనెవరే
తలచియగ తాళిజేసిన తులువల మిత
బాధలు బొంది నాశనంబగుదురవనీ

తే॥ గీ॥ కలుగుననియెడి ప్రళయముల్ కల్లలనుచు
నమ్మిసౌజన్య పత్రిక నమ్మబోక
సంశయించియు వ్రాయక చదువకున్న
పాలుమాలిన దుర్జనుల్ బహువిధముల
నొచ్చి బాధల నొందియు చచ్చెరవనీ

(మంగళం)

—o—

# శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి యుపదేశము

( నవరత్నములు )

( నవ విధ భక్తి మార్గములు )

1. సీ॥ భక్తి మార్గంబులు పరగదొమ్మిదియండ్రు ।
బాహ్యవిధంబులో భావమిదియె ।
ముదమున యవతార కథలను వినుటయు ।
లవవిధములకాది శ్రవణమగును ।
బహువిధంబులుగను భజనలు తాళరా ।
గములతో కీర్తనల్ క్రమముతోడ ।
జరుపుట కీర్తన స్మరణయనంగను ।
చపలతలేనట్టి జపమునెమ్మి ॥

తే॥గీ॥ మదిని యందున ఈశుని ముదముతోడ ।
పాదములు నమ్మి నీవె నాయాదరమని ।
గొలచివేడుట సేవని తలతురనుచు ।
విశదపరచెను జగతి శ్రీ వీరగురుడు ॥

2. తే॥గీ॥ అర్చనయనంగ యీశుని అవతరముల ।
మూర్తులను పత్రముల తోడ పుష్పములతో ॥
పూజలును సేయుదేయగు భువినియనుచు ।
విశదపరచెను జగతి శ్రీ వీరగురుడు ॥

3. క॥ వందనమనంగ విగ్రహా ।
సుందర రూపములగాంచి సురవరులెదుటన్ ॥
ముందుకు సాగిలి మ్రొక్కుట ।
యందురు కోవిధులుదాని యవనిన్ మరియున్

4. సీ॥ వందనంబులుజేసి వదలక బొగడుచు ।
కరముకుళితనుడై కదలకుండ ।
నిలచియు మనమున వలచి ప్రార్థించుట ।
ధ్యాసమనంబడును ధరణినిదియు ।
సఖ్యమసంగను సకల బంధువులపై ।
నుంచిన ప్రేమకు నెంచ మిగుల ।
పరమేశ్వరునియందు బాగుగా నిలుపుట ।
ఆత్మనివేదన మనగనిదియె ॥

తే॥ గీ॥ తనదు చిత్తంబుదై వార్పితమునుజేసి ।
వేరు సంకల్పములు లేక మీరియుండి ।
ధాన్యమునుబూని తన్మయుండై నయనుచు ।
విశదపరచెను జగతి శ్రీపీరగురుడు ॥

## ( అష్టవిధ పుష్పములు )

5. సీ॥ భగవంతునర్చించు పద్ధతి వినుమని ।
వివిధ పుష్పంబుల విధము దెలిపె ।
మొదటి హింసయే ముఖ్యపుష్పంబగు ।
రెండవదింద్రియ బంధనకబు ,
సకల భూతములపై సమదయ గలుగుటే ।
మూడవవిధమగు పుష్పమనియు ।
క్షమమనునదెనాల్గు శాంతియైదవదగు ।
ఆరవదౌ తపస్సనగబడును ।

తే॥ గీ॥ ధ్యానమనునదె ఏడవదౌను మరియు
సత్యమే యష్టవిధమగు జగతి విరులు
పీటిగూడినదే కాంతవిధమటనియు
నిశదపరచెను జగతి శ్రీపీరగురుడు

## -: నీ తి వా క్య ము లు :-

6. సీ॥ తల్లిదండ్రులకన్న ధాతలసేవలు
జరుపుటయే జన్మ సపలతనియె ।
సజ్జనులతో మైత్రి సలుపుట ముక్తికి ।
కారణంబగును నిష్కాపటుకనియె ।
అందరు ఈశుని నందనులై యుండ ।
సోదరభావమే చూడుడనియె ।
భువి మహాత్మే సర్వ భూతాత్మయనుచును ।
దయయు భూతలముపై దలచుడనియె ।

తే॥గీ॥ అతిథులైనట్టి వారల సతతమవని ।
గొలచుచుండుట పూర్ణ సత్ఫలితమనియు
దీనులనునన్న పోశనమానుమనియు
విశదపరచెను జగతి శ్రీపీరగురుడు

7. సీ॥ పెద్దలగనినంత ప్రేమతో దండముల్ ।
సలుపుటతలకు భూషణ సమంబు ।
కపటసంకల్పంబు గలుగనీయకయున్న ।
మది నిర్మలతబొంది మహితపడును ।
సత్యవచనములు సర్వధా బలుకుట
కళయౌను ముఖమున కవని మరియు ।
పుడమి సత్పాత్రల పొందుగా వినియోగ ।
పరచిన యభివృద్ధి పడును ధనము ॥

తే॥గీ॥ పరులకపకారమును హాని జరుగబోవు ।
దుర్విచారముజేయని దొడ్డమనసే

పుణ్యనదులు త్రివేణుల బోలుననుచు
విశదపరచెను జగతి శ్రీవీరగురుడు

8. సీ॥ లేశంబు లాభంబు లేకున్న తనకును।
పరుల కార్యముల తోడ్పడేడివాడు ।
ఉత్తముండనబడు ఉర్విలో నాతడు ।
తనపనులతో గూడ ధరని తరుల ।
కార్యముల్ పోషించు ఘనుడు మధ్యముడగు ।
తనకును లాభమౌ పనుల కొరుల ।
నష్టపర్చెడివాడు నవనిలో నధముడు ।
తనకు ఏలాంటి ఫలానుభవము ॥

తే॥గీ॥ గానిదైనను ఒరులిల గాంచుచున్న
సౌఖ్యములజేర్చువాడు నీచముడెగాక
మానవధముండె నీమహినటంచు
విశదపరచెను జగతి శ్రీ వీరగురుడు

9. కం॥ పరమేశునకీ కాయము ।
ధరణిని రథరూపకమున దగవెలసెనుగా ।
నిరతము చెడుకృత్యములలో
జొరనీయక భద్రపరచు । చుండూటజాలు ॥
దుర్విషయముల చెందూటమేలు ।
పరిశుభ్రమునకయ్యె పలువిధములదోమి
నరయస్నానంబూను నయయూగజేయుచు
మరువకను జాడ్యంబుల న్నుపచారములచే దూరి జాగ్రత
పరచియును కాపాడుచే ఋలభగవదారాధనయిదేయను
చుంముట జాలు । దుర్విషయముల చెందూటమేలా ॥

(మంగళం)

నవరత్నములు

(సంపూర్ణము)

## -: కీర్తన :-

1. మానవా దుర్మరణమౌగనరా చెడుకాలమిదియే జ్ఞానివై కడతేరవలె వినరా మానవా చెడుకాలమంతట నేనటంచని యావరించెను మానవా చెడుకాలమంతట నేనటంచని యావరించెను మానకను ప్రభు సేవ మీరలు బూనుకొనిదరి జేరవచ్చును ॥

గాని భేద ద్రోహ మెందుకురా నిను నీవెరుంగు
లేనిపోని యూహలెందుకురా దురుమార్గబోధ
హీనులను జదనీయకుండుమురా నిజభక్తిగలిగి
ఓన్నమోనారాయణా యనరా
మానితంబుగ సంచరించుము దీనులను ఎగతాళి సేయకు
జాని సేవుదేసికునకయ్యేవు పాయమేఘన మంచెరుంగుము ॥మా॥

2. జాతిమతభేదములు సేయకురా ఘనమైనజాతె నీతియనివేదములు బలికెనురా గౌతమ గార్గేయనారద కణ్వకపిల వశిష్ఠ మొదలగు నూత విశ్వామిత్రవ్యాసులు శుకుడు శౌనకు లేకులంబొ.
ఖ్యాతినొందిన వారలేకదరా మమయాత్మసర్వ
భూతయాత్మనిచాటలేదటరా అద్వైతమతమే
రీతియనితరియించి గాంచిరిరా తారార్కముగను
భూతలంబున నిలచియుండిరిరా
భూతలంబున నిలచియుండిరిరా.

భూతకరుణయె సర్వజయమౌ రీతిగాదిది కారుదున్న
పోతులావలె తనువుబెంచియు కోతులావలె వాదులాడెర ॥మా॥

3. జీవహింసలు జేయబూనకురా అందరికి భువిలో దావుసిద్ధంబచు నమ్ముమురా జీవులను హింసించి హత్యలు జేయుచే రాక్షసుల కృత్యము కావరముకను గానకనుబహు తీవరము చేమిడ్డి పడెదవు.

లావుదేహంబనుచు మురియకురా శిక్షించుకాల
మావరించిందనుచు దెలియుమురా షడ్వర్గములను
తావునుండి పారదోలుమురా సాటెవరు నీకు
నీవె నిర్మలమానసుండవురా.

పావరంబెడ సేయబోకుము జీవులన్నిటి యందు నిత్యము
కేవలముకై వల్యమందెవు ధీపరులు కొనియాడెదరు నిను ॥మా॥

4. కన్నవారల గావింతుమురా "నిష్కామివై భువి" యెన్నో విధముల సన్నుతించుమురా ఎన్నిశాస్త్రములందు వెతకిన కన్న వారలతో సమానము నున్నయని మొరలీడుచుండెను కన్నులిప్పి చూడు ఖడివె.

చిన్నపెద్దల మన్ననెరుగవురా దుర్మదముచేత
మన్నుమిన్నె దైనగానవురా క్షణకాలమగు
తన్నులేపా ప్తించు చూడుమురా ఎచ్చులకు నీవు
వన్నెలనుబడియేవు యెందుకురా

అన్నలార సద్గుణంబె వన్నెయౌవే రెండులేదిక
తన్నుతాగనుగొన్నవెనుక వున్నవాడెవాడె వీడు ॥మానవా॥

5. ఏదికుల మొటులుండో రూపమురా ఎచటుందొమాలమాదిగుల వర్ణించి చూపుమురా ఏదిరారుషికులమునెన్ను వాదకులెగనుపించజాలరు పాదుగనజాలకను నీపిరోదనే సాగించుచుంటివి

ఆదిహిందువు లనుచు దెలియుమురా పరికించిచూడు
భేదమేమియు లేదుగలియుమురా అంటనుచునీవు
శోధజేయక వాదులాడెదవురా అందరికివకదే
యాదినారాయణుడు గాండుమురా

మోదమలరగ నీవు సృష్టి యాదిమూలం బెరొగనుగొను
నీది నాదియనేటి భేదావాదులన్నిదజాలవప్పుడు ॥మానవా॥

6. సత్యకాలము వచ్చుచున్నదిరా ధర్మంబెపుడమి నిత్యమయ్యి నిలచి యుండునురా కుత్సితులు నిర్మూలమయ్యి సచ్చరిత్రులె శేషమగు దురు యత్నమైకనుపించజాలరు తుచ్ఛలమ్మిడి కొడుకులీధర.

మత్సరంబులు మానవేమిటిరా ప్రజలందజేరి
యత్సరించెవు లుచ్ఛబోధలురా ఉదకంబు బాసిన
మత్యవిధమున చచ్చెదవు వినరా ఇమనైన నీవు
పత్యకునవై పాతకములిడరా

సత్యమైన ప్రచార ధర్మశాస్త్రములు విడనాడి మనుజుల
ఇత్సలను చెరువాకపరచి కచ్ఛలనుగలుగంగజేసెవు ॥మానవా॥

7. కానరామనుజుండుగాడూరా బ్రహ్మదుద్రిదళిలా జానువేయి తరుండు లేడురా కానరా శ్రీ వీరగురుడు మానవుండనియన్న తగదిల పూని నీవెవరో యెరుంగుము కానకను చీకాకుజెందవు

లోనవెలుపలనిండి యుండెనురా ఇందందు యనక
గాననీవది గాంచవేమిటిరా భావించిచూడ
తానె సర్వంబయ్యె చూడుమురా సోమరివిగాక
దీని భావకభేమొకనవలెరా

నేనె బహుశూరుండనంచని నిక్కెదవు నీల్గెదవు పిదప
హీనమైకాలమున బడెదవు లేనియెమ్మెలువలదు మనకు ॥మా॥

8. మట్టిదీ స్థూలంబటనియనరా శోధించి దీని గుట్టుగనుగొన వట్టిదే యగురా దిట్టమైనటువంటివాడను తుట్టునాకేమిటికటంచని గట్టిగా శపదంబుజేసెవు పట్టెడన్నముకొరకు నీకు ॥

గుట్టలైనా చాలవేమిటిరా నీ యాశగూల
మట్టిపాలా గుట్టలౌగనరా దుర్భలుల జూచి
మొట్టెదవ్వా యాసపెట్టెవురా తుదమొదల్ లేక
పొట్టపెట్టి పోయెదవు వినరా॥

ఇట్టిదీతను వంచుదెలియవు ముట్టడించును శ్రీ ప్రభుండిల దిట్టముగ బంధించినీతల గోట్టునూ కుయ్యోమొరోయన ॥మా॥

9. మేలుకొను తరణంబిదేయగురా దుర్మార్గవృత్తిచాలు పశ్చాత్తాప మొందుమురా శీలమని భావించబోకుము కాలమేమారుచును వచ్చెను గోలజర్గును దుర్జనులపై మేలుకొను శ్రీఘ్రంబెమూఢా ॥

వేలవై తిరుగాకు చెడెదవురా నామనవి విన్ముఇతి
మాలుచుంటిని కీడుమూడునురా ప్రభువారు నిన్ను
కాలుసీ పట్టణము కంపెరురా నగు బాట్లగునీ
స్థూలమే తునకముల పాలగురా

చాలగానే నెవ్వలెమ్మలు చదివినానని మరియు బోకుము
కీలుదెలియని దేటిచదువిల మూలమేదో గానవైతివి ॥మా॥

10. ఆసలోఁబడి మోసపోకుమురా చనువెంట తుదకు కాసువీరం బైనగా
మురా దోసెదవు నిరుపేద జనులను కోసెను ముక్కలుగవిన్ని
తీసుమారుకాఁ నటంచని మీసములుండి బెట్టెదవు బహు॥

దోసమని భావించవేమిటిరా నిష్ఫలంబగునీ
యాసలన్నియు రోసివేయుమురా గురుజేరకున్న
మోసమే కడతేర జాలవురా
దాసుడౌ నిలదోరెపల్లి వాసియైన మహమ్మదీయుడు
ఖాసిమలి విజ్ఞాపనే యిది గానరా చెడియేపు పిమ్మట
మానవా దుర్మరణమౌగనరా చెడుకాలమిదియెజ్ఞాని
కడతేర వలెవినరా॥

( తప్పులున్న క్షమించుదురని ప్రార్థన )

ఏతత్సర్వంబును శ్రీ వీరబ్రహ్మేంద్రార్పణమన

మంగళం మహత్

మంగళం మంగళం మంగళం

( సంపూర్ణం )

# శ్రీసుప్రసిద్ధ కవీశ్వర పండిత బ్రహ్మజ్ఞాన వేదాంత వేత్తలగు వారి విరచిత

## (తత్వములు)

- బ్రహ్మశ్రీ మౌల్వీ సయ్యద్ యిస్మాయీల్ సా॥ నల్లగొండజిల్లా దోమలపల్లి గారి విరచితము

1. గురుచరణమనీ గురుకరుణయనీ గురిగలిగితె దొరుకును వరము సుమీ పరతత్వమనీ పరమాత్మయనే పరమార్ధము దెలుపుము శరణుసుమీ॥ ॥గురు॥

2. నిరుపమ నిర్గుణ నిర్మలుడు చరాచరముల కాది పురహరుడు దొరదాతయుగా నశరీరుడవు దరిజేర్చిన పరవుపకారిసుమీ ॥గురు॥

3. ఈవృత్తయల్ మరి ఏమియు లేదా వత్తదినిండీ వారు సుమీ మఃవేత్తలు గాంచిన ద్వాదశిని నిదిత్తమనీ బోధించెదసుమీ॥గురు॥

4. కలగల్గిచలించెటి కాయములు మేల్కాంచిన లేనివిచిత్రములు ఇలపంచదశీ స్వాభావమని తొలగించెను మదిసంశయము సుమీ ॥గురు॥

5. ఈ మూలములేని శరీరమని ధరనేమియులేని షోడశిని ఓనమాలుయనీ మదినెంచకుమా జన్మాదులదునె మాయధము సుమా॥ ॥గు॥

6. సయదమ్మరు సద్గురుపలుకులవి నరకెయ్యాలు గాంచవిమొలకలివి సయదిస్మాలు నోటలొలుకులివి జయమొందెడి మార్గము హోయలు సుమీ॥

## 2. (తత్వము)

1. సోహమును సాధించవలెనన్నా సద్గురుడొనంగిననోహచే శోధిం
వలెనన్నా సోహమును సాధించితేదురు ద్రోహములు దహనా
పోవును దేహమున దివరాత్రులందు సాహసంబుతొ హంసబలి
॥సో

తారకంబిది తరచవలెనన్నా దీనిజంపి పూర్వులూ కదతే
నోరన్నా ఆరు ఆధారములుజుట్టి సారెకునుసహస్రారకమలము
జేరిదిరిగి యధోముఖంబున జారినాసిక ద్వారములతొ దిగి
మారిబై లలొ కేరిచుండన్నా పూరేదుపిట్టరాయ ఖారిగదిర్గ
చుండన్నా నేర్పెరిగిదాని కుంభకమునా కమ్మియుంచన్నా కమ్మి
నపక్షోంకారమయ్యి ఝూంకరించన్నా

తారుమారుగాక మీరిమేరువాపైకాకి బ్రహ్మద్వారమిప్పిదూరి
పరిపూర్ణమగు పరమాత్మగనబడు

2. యండమావుల నుండబోదన్నా జలమావిధంబిలముండ నమ్మి
తెదండి లేదన్నా
కుండవంటి తనువుమృత్యువు గుండుతాకితె పగిలెనేలా పిండిగన
పడిపొయ్యేదానికి కుండయని యాసించి నీవు
గుండగొయ్యవు గాకుమాయన్నా గుండెధైర్యంబుంచే నేమన్నా
దండాధరుడుతల పండుపగులాదన్నునోయన్నా
యమబంటులాకీ కండర క్తము తిండియగునన్నా
అండపిండమునుండి నూర్ధ్వాకుండలాగ్రమునిండి మరి బ్రహ్మాండ
మంతట కాశిపండిన పండువెన్నెల కండ్లగనుటకు ॥

3. చావుపుట్టుక స్వభావమోయన్నా జీవించుకాలము కావడిబరుకష్ట సుఖమన్నా

పావరంబున పోతుయనుమూ లావుబెంచిన కాయమునకు గావుబట్టి తుదకు మృతిగొని పోవువల్లెకాడుజేర

కావరంబెందూకు మాయన్నా మదమోహమృగముల తావునుండి తేవగొట్టన్నా

పావుశేరు ప్రసాదమూదిన్న యశాపిశాచికికావలే యపరంజిగుట్టన్నా

కావునతత్వ విచారముతోవ వెదకుము నణచి దాన్ని

కేవలము కైవల్యపదవిని గాంతువూ గురుసేవ గలిగితె ॥సో॥

4. తోలుబొమ్మిది తాలుగానున్నా బోలయ్యి మాయ సహానుకూలం గాదురాయన్నా

మూలమును లేనట్టియరుకా స్థూలములు గనుపించికలలో

మేలుగాంచిన వెనుక అనుమాలులేక పలాయనములకు

వీలుదెల్యాజాలవేమన్నా కలియుగా స్వప్నము లీలయిందా జాలమో యన్నా ఇందూల నీవు లోలుడావై బేలగాకన్నా గురుకీలు జెంది పాల భాగమునొంది జూడన్నా

నీలతోయదమధ్య చిన్ని బాలుడొకడు య్యాలలూగెటి

సాలదెలిపిన సయ్యదుమ్మరు గురు జోంమరువ గడాల డిస్మాల్ ॥సో॥

## 8. (తత్వము)

1. పరిపూర్ణం బాపిపరమున్ దరిశింపరారెకోరి

పరిమాణం లేని యచలం పరికింప బయలుదేరి ॥పరి॥

2. హరిహరాదుసురు లరగినదారి నెరిగినరులు మహామునివరులై
గురిగలవార్గను గొన్న మార్గము సరియేదని సద్గురువరుజేరి
॥ప

3. అచ్చటనున్నది మచ్చుమారి మెచ్చదగినదని మచ్చికమీరి
రచ్చకువచ్చి రహస్యమైనదా నెచ్చరించవలు కెచ్చదుజారి ॥ప

4. అగోచరంబని వగచెటివారి కగోచరంబౌ తగవులదీరి
యుగాయుగంబౌ రేబగులొకటే పగిదిగనుండెను దగినసు
॥ప

5. యెరిగినదనుక యరుకారివారి యెరిగినపిదప ఎరుకపరారి
యెరుక మరుపులు ఎరిగిన దేదోనెరిగి దెలుపగురు పరవుప
॥ప

6. ద్వయ మద్వాయమోమిదం శరీరిన్వయంబు సర్వమయమౌ
పయంబరన్నది నియంబిది అన్వయంబు కుల్లేవయిన్ బదీరి ॥ప

7. యెతియోగులు సద్గతులకుపోరి వెతకినరస్తా మతములవారి
వ్రతముల కల్పని తత్వవిచారము అతీతనివృతి యోగి కమోది
॥ప

8. సయ్యదువుమ్మరయ్యగారి నెయ్యెదిరిగే బొమ్మవికారి
సయ్యదుఇస్మాల్ బలికినదంతట నిండి యున్నది నిర్మలక
॥ప

## 4. (తత్వము)

రామరాముని రాము దలువండీ పామారులార
రామమనగే రాము దెలుసండీ

రాము రేణుక పుత్రుడును వక రాముదశరథరాజసుతు బల్ రాము కృష్ణునియన్న అవతార నామములచే వెలయు వారలు రామస్మరణా మానకుండిరి శ్రీమాన్ పారంధాముని పరికించుచుండిరి. మైమారినాత్మ రామమంద్రైక్యామై యుండిరి యేమాయలేక నిరామయం సర్వామైనుండిరి యీమహిలో మానవులు సామాన్యమా శ్రీరాము కనుగొన స్వామియగు సద్గురుని జేరని సోమరులు కామాంధమునబడి రాముదెలియక నోము కుందురూ రామానుజామత పామరంబులో పొర్లుచుందురూ అష్టాంగ యోగము ధూముచే సాధించి కొందారూ పరమార్థ మొందక వుద్దికిని స్వర్గాని కందారు రామతత్వామసిపదంబని కీమదెలిపెటి దేసికేంద్రుల మోముగానని మూర్ఖమనుజాం కోమలంబుతో కొట్టునెముడు.

2. బాటగానక కాటుబడకండీ పొరపాటులయ్యేడి
పాటిమీదను మాటుబెట్టండీ

కోటలారును దాటియావల కాటుకాపిట్టాలపైగ సూటి జూచి తాటి కెరుకను బీటిలోబడ యేటుయేసి త్రికూటపేట కవాటమిప్పండీ అచ్చోట తామరకొలనుచింతల తోటగాంచండీ కాసింది పున్నమినాటి వెన్నెల సాటి వెలుగండీ యెచేటెరుంగని మాటబట్టా కైటనిలువండీ వాటమగుహరినాట కంబిది కాతకులకూ దాటిగుదరదు నూటికొకడీపాటగురువరు నోటవించెనె పాడునూ కైలాటకుల తెరచాటునున్నాదీ మత భేదచెరుదూ వాటుమదిలో నాటుకున్నాదీ ద్వైతంబనే వహివాటుమనసుతొ మీటకున్నాదీ అలాటివారికి మృత్యుదేవతె మోటుకున్నాదీ మేటులామని భేషజాలుసాపాటు కయ్యా లపోటుకూతలు లేదిటిోధలతో విరాట్టును భేటిజెయ్యక కాటికంపెను.

॥రాము॥

3. తన్ను దెలియక తన్నుకోకండీ ఎన్నాళ్ళకైనా మన్ను
పాల్కై పొయ్యేతనులండీ॥

గిన్నెలావలెకన్నులూరి మన్నుమిన్నై దైనదోచక దున్నపోతు మీరి పిన్న పెద్దలమన్న నెరుగని యన్నలారా యెన్ని జూడండీ యః ఖటులచిన్నా తన్నులకెత్తాం తర్లుతారండీ మేమన్న మొనగాండ్లన్నమ భూమన్నుదినునండి మున్నగినారలు యెన్నడూకనిపించరేమండీ చిక నామొరవిన్న మాత్రము తిన్నగను గురువన్నజేరి కన్నతండ్రివటం మరి వెన్నెన్నోవిధముల సన్నుతించి సవ్నడిడ్డిదూరి చూడండీ పన్నా కాయి యెన్ని తీప్లయి యున్నవాడండీ వేమన్నగారు అన్నది విన్నా లేరండీ తన్నుతదెలిసితె తానెబ్రహ్మంమన్న తీరండీ మన్ననాచేనార్యుల నోటన్నదీ బల్నన్నంమార్గముకన్న వారితో కొన్నదీ ప్రాసన్నమై ప్ర లున్న బయలు॥ ॥రామ

4. యెచ్చులెమ్మెలయిచ్చ వలదండీ తామెచ్చుకొనుట అచ్చు వాట వచ్చువానండీ

కొచ్చనుండీ కదలికొన్నా ల్లుచ్చగుంతలోవునికిజేసి పిచ్చము పిండమైయిహచిచ్చులోకి జొచ్చి వెట్టిపుచ్చకాయలు పుచ్చుకోకండీ పిచ్చిగాలము గ్రుచ్చుకున్నా మచ్చవిధమండీ నొచ్చినాకలినాల్ ముచ ముచ్చట్లుతారండీ భ్రమహేచ్చిమీరలు మచ్చికలతో జచ్చుతారండీ యెః టుండిచ్చోటి కేగెచ్చొటికిమును తెంచుతారో అచ్చరితమునార్యులతో గ వచ్చు వారలపంచజేరుక గిచ్చికయ్యము దెచ్చుతారండీ వారీమహత్త్య దెచ్చిమీరలు పుచ్చుతారండీ సచ్చిదానంద మనస్కసాంఖ్యులవి లేరండీ కుచ్చిప్పట్లమై మీ రచ్చి తనకూగాంచలేరండీ స్వచ్ఛమైన సంజ్ఞసద్గ సయ్యదుమ్మరు భృత్యులై ములు గుచ్చ సందూలేనియచలము నిత్యగ గొనవచ్చు ఇస్మాల్. ॥రామ

# బ్రహ్మశ్రీ నల్లగొండజిల్లా దోమలపల్లి గ్రామవాసులగు నాగార్జునం కనకాచారిగారి విరచిత

1. బాగుగా భక్తులను పరిపాలనము సేయు ప్రభువు వస్తున్నాడోరన్నా॥ ముందుకాగల కాగల కార్యముల్ కనురెప్పపాటున క్రమముగా జరుగునోయన్నా. ॥బా॥

2. జారచోరుల మరియు పామరులగొట్టియు బాలహింసలుబెట్టునన్నా మరియు క్రూరకర్మలబట్టి కూలదన్నుచుభువి గోలజరిపెరు భక్తులన్నా ॥బా॥

3. కులభేదకలితలను కూలద్రోసియు మీరు కలసి మెలసుండు రోరన్నా గురుడు ఆలవిగానటువంటి ఆయుధంబును బూనె ఖలుల ఖండించరోయన్నా ॥బా॥

4. రాముడీలోకమున వీరభోగవసంతరాయు లవతారుడైయన్నా పూని ఈ మహీనంతయు నేకచక్రంబుగా ఏలును ఖరపక్షమన్నా ॥బా॥

5. నిక్కముగా గురుడన్న వాక్కులివి బల్కితివి విజముగా దనకు [illegible] మొక్కవలో గాంచుడోరన్నా ॥బా॥

6. ధరణిలో కోదండ పురమందువెలకొన్న పురహరుని భక్తుడావన్నా గురుని తరుచుగావేడెటి వాడదోమలపల్లి దానకనకా యాఖ్యునన్నా ॥బా॥

# బ్రహ్మశ్రీ మౌల్వీసయ్యద్ అబ్దుల్లాషాఃహుసేని నల్లగొండ జిల్లా పానగల్లుగారి విరచితము

## 1. తత్వము

1. గురుబ్రహ్మయనీ గురువిష్ణు మహేశ్వరు డానెశ్రుతినిజమే సుమీ
గురుదేను అహంబ్రహ్మస్మియనే హరివాక్యమిదీ ధృడమాయె
॥సుమీ॥

2. ధరఎచ్చట నుండిటు వచ్చితిమో యరుదెంచెద మెచ్చటికో యనిః
వరెసంశ యబిందువనేల వణం హరిసాగరమందున గల్పుమనే॥

3. అయమాత్మడు ఆర్యుడు ద్వాదశితా దయసాగరుడై బోధించగనే
ఐయలాయనుసర్వ మగోచరమూ తెరదీసియు నన్నిటుజూడుమనే॥

4. వినుతత్వమనీ మహావాక్యమును గనుతత్వవిచార మహాత్ముంః
అనిపంచదశీ బోధించినను తనయందున ఐక్యము జేసెసుమీ॥

5. సుజ్ఞానవహటీబెను మావినునీ ప్రజ్ఞానం బ్రహ్మంబైనదనీ
అజ్ఞానము షోడశిద్రోయుననీ విజ్ఞాపనవిని నన్బ్రోచెను సుమీ॥

6. పాన్‌గంటిహరీయన నయ్యేవతన్ గనుగొంటిని సర్వము ఐయ
లనుచున్ వినుసయ్యదు అబ్దులె బ్రహ్మమనీ యనబోకుము లోకుః
నిందె సుమీ.

# బ్రహ్మశ్రీ గుంటూరుజిల్లా గురిజాల తాలూకలో చేరిన దైదపుర నివాసులును ఘటము కాంతయ్యగారి తత్వము

1. ఏమిజెప్పుడు యరుకలేనిదీ అయమాత్మ బ్రహ్మ నామరూపా శూన్యామేనాది । యేమి జెప్పుడు యెరుకలేనిది అంతతానై వెలుగు చున్నది । శ్రీమహాపరిపూర్ణ బోధిది చి త్తశుద్ధితో యాలకింపుము॥ ॥ఏమి॥

2. జ్ఞాన మజ్ఞానంబు గానిది జ్ఞేయజ్ఞాతృలేమి లేనిది । తాను నేనని భేదముడిగితె తత్వమశియై వెలుగుచున్నది ॥ఏమి॥

3. ఉన్నదంతా సున్నయౌతుంది నిశ్చబ్ద బ్రహ్మ కన్నమిక్కి లేమి లేనిదీ॥ ఉన్నదంతా సున్నయనియెడు ఊహకు మిగిలున్న దానిని కన్నవారల వాక్కులివియని కల్వరము విడనాడి నమ్ముము ॥ఏమి॥

4. జనకశుక సాంధీపకృష్ణులు అర్జునుడు మొదలాసనక సాదిమౌని వర్యులు తినకరుచులు దిగక లోతులు గనియు మరియు బట్టి బయలున ఎనుక ముందుకు జన్మలేదని ఎగరజిమ్మిరి జ్ఞాత నూయిక ॥ఏమి॥

5. వసుధలోపల దైదపురమందు ఘటకాంత చంద్రుడు వ్రాసివాక్యాలి [illegible] మొందు । అసలు లేనిది షోడశకళ అమలవముగ వి [illegible] వంచదరిని । మనలోనా [illegible] మంత్రమే [illegible] నమ్ముము ॥ఏమి॥

# బ్రహ్మశ్రీ సయ్యద్ ఉమర్ షాహూసేని నల్లగొండజిల్లా పానగల్లుగారి తత్వము

1. యాదిలోపల అబ్దుల్ ఖాదారు గురువరులబోధా నమ్మిక యుండావే ఓ మనుసా ఇల బోధానమ్మిక యుండావే పదిలముగ మదినిలిపి ముదమున సదయుడగు గురుజేరి పదముల వదలకన పూజించితత్వవినోద మున రంజిల్ల రాదటె. ॥యాదిలో

2. ఎందూకె ఈతుచ్ఛయుగ్రభమలు నీవికానంద మొందగ రాదటె ఓ మనుసా ఇల నిందాతో భయమేటికే ఎందుదోచక కొందరున మునులందురని ఘనమందమతు లానంద బ్రహ్మంబనగ కన లేక దవిజేరియు చెడిరినిజముగ॥ ॥యాదిలో

3. యండమావులపగిది నుండేటి యరుకాను దండీదనుచు మురువాకే ఓ మనుసా ఇల దండీదనుచు మురువాకే అండపిండము వెడల మధ్య గండికావలనున్న సూర్ధ్వ కుండలని శోధించి ఘనబ్రహ్మంబ నాయకు నందజేరియు. ॥యాదిలో

4. ధరలోన పాన్‌గంటి పురపారబ్రహ్మము నిర్మాల నిర్గుణుడే ఓ మనుసా విను నిర్మాల నిర్గుణుడే అరమరేటికి యనుచు తన కరములను శిరమునునుంచి ఘనమగు పరము దెలిపిన శా ర్యోగిని హరుని భావించి కొలువవలె ॥యాదిలో

5. చిద్రూపమైన చిదానందమూర్తి చిద్విలాసుడని ఎంచా ఓ మనసా చిదాకాశుడని ఎంచావె చదరకను కదలకను బెదర చేరియున్నది బట్టబయలని కుదురుగనుగొనె సయ్యదుమ్మర మదికినిశ్చయ మార్గమిదెయని ॥యాది

## 1. తత్వము - ఆదితాళం

1. మనసెంతో మాయలాడిరా । నను మమతా నొందగజేసే
హంసోహమన్నది మరచి । మాంసాపు దేహము జూచి
హింసాలు నొందగా జేసే । సంసారమున బడదోసే ॥మన॥

2. జనవాంఛలోనా జొచ్చే । లేనిపోని వార్తా దెచ్చే
అనుమానమెంతో హెచ్చే । నను చాల మోసపుచ్చే ॥మన॥

3. గురువారు ధ్యాన్నం మీరి । హరిదాస వరులను దూరి
పరనారీమణులను గోరి । మరులొందె మోసకారి ॥మన॥

4. కనులాచె చూచినదంతా । కావాలెనను దోకచింతా
ధనమాశలోన కొంతా । ఘనమూగ బడెను చింతా ॥మన॥

5. వహవ్వారె యెంత హంకారి । జగమెల్లనున్న దొకపారి
సవ్వారి యిది సదారి । యెవ్వారికైన విదారి ॥మన॥

6. భూమిలో బుట్టగజేసే । రామాని పిలువ వలసే
భామనార్యు చేరగజేసే । బహుబాధలను బడదోసే ॥మన॥

## 2. తత్వము - ఆది

1. ఛో ఛో ఛో యనరా సంసారి నీవాకసారియైన । ఛో ఛో ఛో యని జోడు నల్లెడ్ల గట్టి భృగుమధ్యామందూ వున్న పూరిలేనట్టి చేలో ॥ఛో॥

2. అజ్ఞానంపూ నట్టి చేలో సుజ్ఞానంపూ నాగలిదోలి । నాగలి పీఠా యెక్కి తొక్కినట్లే పెల్లల్ । విరగదీసి ॥ఛో॥

3. గురుధ్యాన మనేటి గుంటుక గుర్తుగానే కట్టుకోని । కామక్రోధ లోభముల గడ్డలు పెడ్డలు సదసము చేసి ॥ఛో॥

4. మమకారమనేటి నలికి మనసు యనెడి సిబికిబెట్టి । చుట్టుపట్టునున్న చెత్తయెదిరి మంటమీద వేసి ॥ఛో॥

5. కోర్కెమీద గొర్రు గొట్టి గురు మంత్రంబనె విత్తనమేసి । తరిగి మళ్ళి పుట్టకుండా తీరైన మొక్కలు మొలచు ॥ఛో॥

6. యూనుపొట్టె సమయమందు వివరమైన మంచెవేసి । మంచెమీద ఒంటికాలి కాపువాన్ని కావలుంచి ॥ఛో॥

7. వడిన వ్రాళ్ళు కట్టుకోని వరుశాలయు చేతబూని । మీరియున్న యిరువై అయిదు పిట్టలు వాలకుండ దోలి ॥ఛో॥

8. పరమధ్యాన్నమనే కొడువటిచేత పాకామైనా జొన్నకోసి । వేడా లేసి మేడాలేసి వనరంగా గూడొక్క చేసి ॥ఛో॥

9. గురుమంత్రంబనేటి గోటగూడు విప్పి కంకుల్ నలిపి । ముద మూతో సయ్యదు వుమ్మరు పాదమూపై రాసిబోసి ॥ఛో॥

## 3. తత్వము - ఆది

1. ఓసి మనసా విను దేసికునకు దాసివికావలెనే । కాసులు కాయము గురుకర్పించుపదేసి కావలెనే ॥ఓసి॥

2. నేను నీవనే నేరుపు మరచి సరిభేష్ కావలెనె । జ్ఞానితానై తత్వము గొనుటకు నోసి రావలెనే ॥ఓసి॥

3. చావు పుట్టుక తనువు ఛీ యని రోసికావలెనే । భావించాత్మ జీవుని గని సంతోషివి గావలెనే ॥ఓసి॥

4. కామ క్రోధ మదముల మేడలు కోసిరావలెనే । రామనామ రత్నముల మూటలు మోసుక పోవలెనే ॥ఓసి॥

5. నాసిక మధ్యను శ్వాసతోను సంభాషిగావలెనే । మోసములేని ఐయలును హంస మేపరావలెనే ॥ఓసి॥

6. వాసిగ దేహం విశ్వనాధుని దాసిగావలెనే । ఈశుండగు జీవేశ్వరు పూజలు జేసుకోవలెనే ॥ఓసి॥

7. సమ్మతితో సయదుమ్మత్నతి కృప వాసిగావలెనే । పిమ్మట పాదం బట్టి పరమును దోచుకోవలెనే ॥ఓసి॥

8. సోమరిగాకను శ్రీహరిగని షఃబాసిగావలెనే । యిమ్మహిలోతం ఇస్మాల్ ఇహ పర దేసి కావలెనే ॥ఓసి॥

## 4. పాట - జావ్లి

1. పరమేశ నీమహిమలూ సద్గురూ । పరమ భక్తులు గన్నరూ శరణన్న భక్తజనవరుల దగ్గరతీసి శిరమందు కరమిడి పరిపూర్ణ చలబోధ నెరిగించ దలచి మీరు సద్గురు । ధరలో జన్మించినార ॥పరమేశ॥

2. సారమేమియులేని సద్బోధ యిది యని ద్వాదశీ షోడశీ ద్వయ మంత్రములు దెల్పి రాదుపోదని యంటిరీ । సద్గురూ లేదు లేద యంటిరి ॥పర॥

3. అందు యిందనరాక యెందుజూచినగాని । సందులేకనె యున్న సత్యమైన పదవి । ముందుగను జూపించగా । సద్గురూ సం యంబులు దీరెను ॥పర॥

4. మూలమేమియును లేని నాల్గవ దేహంబు । కీలుదెల్పి మీర మేలుగా బోధించ । కలలో చిత్రంబాయెరా సద్గురూ । కాంక్ష లన్నియు దీరెను ॥పర॥

5. మనుజులందరినోట మరి దలంచి పూర్ణ । మేను కాదనుచు య్యా తనువు తనకూలేదు । తనకుంచె సరానిది । సద్గురూ కద కంతటయున్నడి ॥పర॥

6. ఖండఖండములుగను కనుపించెను । పిండబ్రహ్మాండంబ లిరెండు । ఉంతజూపి యెరుకనూ । సద్గురూ యుండితిరి క్షణమ లోనా ॥పర॥

7. పూనుకొని యున్నిట్టి పూర్ణమిటువంటిదని । లేనెరుక వెరిగితే లేదుగద యేమసరాని రానియెట్లందును । సద్గురూ పోనిదవి యెట్లందును ॥పర॥

8. ఉన్న పరిపూర్ణమును యెన్నియు లేనెరుక । యెన్నడూ లేద నుచు యెన్ని చాటువులతో విన్నగ వింటెను । సద్గురూ సున్న జన్మంబాయెను ॥పర॥

9. యెల్లలోకములందు యెండమావులటంచు । మళ్ళి జన్మకురావి మార్గంబు బోధించి । వుళ్ళక్కియని యంటిరీ । సద్గురూ వుత్త బయలని యంటిరీ ॥పర॥

10. పూర్వజన్మ సుకృత పుణ్యవిశేషంబు । యుర్విలో మిముజేరి నిర్వికారునిగ౦చె సర్వంబు సున్నాయెను । సద్గురూ సాక్షిలేక నె పాయెను ॥పర॥

11. ఈధరలో మీమాట యాఏమరుతామన్న । రాదు యేన్నటికైన ఓ దయాసాగరా । బాధలన్నియు బాపియు । సద్గురూ భ్రాంతి రహితంబాయెను ॥పర॥

12. దేశికులు శివరామ దీక్షితుస్వాములు । వాసిగ అప్పయ్య అచల బోధయు విని । శ్రీసీతరాములతును । సద్గురూ వాసిగా వివ జెప్పెను ॥పర॥

13. వేగ సీతారామ విభునివేడి । శ్రీ భాగవతుల కృష్ణ యోగివి సేవించుకొని । ధరలో శ్రీ రామదాసు । సద్గురూ బాగ సేయుత తెల్పెను ॥పర॥

## 5. తత్వము - ఆట

1. పిచ్చిపాడె గట్టనైతిని । ప్రారబ్ధకర్మను తెచ్చినాడె కొట్టనైతిని పిచ్చిపాడె గట్టనే మరి పిచ్చిరేగి స్వభావమైన । పిచ్చిరానందాం వదలహ చిచ్చులోబడి దుమికివచ్చి ॥పిచ్చి॥

2. వెర్రిలేచి కుర్రిగుణముచే । తంద్రిపుర్రెలో ప్రభలివెడలి । మురు కూపముతాల్చి తల్లి । బొర్రెలో యెగదూరి ముట్టును । బిర్రిక్షే కొని యుంటిని । నవమాసములు నే । నెర్రి రక్తము జుర చుంటిని । యీ బుర్రిగన్ని మర్రిలూ యెక్కించుకుంటిని మిర్రినెవర్కుకూ జెర్రివలెనే మెదులుచుంటిని । పిర్రిబల పిదపయోనిధి బుర్రిగుండా నిర్రిసీల్గుచు । జెర్రిగరచిన తీ కుయ్యో మొర్రియని బయటనిటు తరలి పొరలి ॥పిచ్చి॥

3 దుద్దిగాద్రై దినదినంబున ముద్దిగుద్దభిమాన మెరుగక । యెద్దేవలె బద్దువదలి । చెడ్డమంచెరుగాక తిరిగీతి । జనసొడ్డులాకు తెడ్డుజా గట్టకరగీతి । నాకడ్డమెవరని గుడ్లుతెరచీ తొండ్లుచర్చితి హెడ్డంచు విద్యకర మైసాధించ గలిగీతి । వద్దుగానక విసికితను వెడ్డుబడ్డ చాలుననుకొని । దొడ్డ ఆశతో దగిలి తగిలి గ్రుడ్డిగా విధమున చెడియు తిర్గితినే ॥పిచ్చి॥

4. బువ్వవల్లను కోవ్వుబెరిగి । యవ్వనంబున జూచి చక్కని పువ్వు బోణుల పొందుగోరి గవ్వలు వ్రయబెట్టు వెతలచె । తీవరలు తర్లుచుంటినీ । అయ్యయో నేనెంత నవ్వుబాట్లయి బ్రతుకుచుంటి యీవిధంబుగ నేగుచుండగ శవోశ్వయని మా యవ్వలక్కలు నొవ్వకుండనె దువ్వి సతిమెడ కొయ్యను బడవెయ్యగానె ॥పిచ్చి॥

౬. తిక్కదిప్పిన తత్త్వవరుడు చక్కని సయ్యదమ్మరార్యుని నిక్కముగ నా గురుడనుచు మ్రొక్కియిడిగల దిక్కులెల్లా । సొక్కగా దాటించుచుంటిని । ధస్మీయక్క వృత్తతోకున్ త్రొక్కుచుంటిని । షోకమిదెరా సయ్యదిస్మాల్ । తక్కువెక్కువలేక సర్వం వక్కరీతిగ వెల్గుచున్న రొక్కమూ చే జిక్కినంక ॥పిచ్చి॥

## ౭. తత్త్వము - ఏకతాళం

1. అహా నీ చాలుదెలిసెనిక । చంచలమిడువవె మనసా । సోహా మనవె హంసోహమనుచును మోహమువిడువవె వోమనసా ॥అహా॥

2. కలికి నీ మాయదెలిసెనిక , నిలుకడగనవే ఓమనసా । తల్లిగర్భమున చదివిన చదువూ మళ్ళి చదువుమిక ఓ గడుసా ॥అహా॥

3. బడాయేల నీలడాయి తర్కం యెడబాయవె యీయెడ ఓ మనసా । తుడాయించివిను బడాయింతు గురు కడాన విలువవె ఓ మనసా ॥అహా॥

4. వట్టిమాటలని ఆటలాడె గురు తీటబాపుతదె ఓమనసా । ఘట్టిగాను కనకయ్య వ్రాసెను తిట్టలోకుము ఓగడుసా ॥
సూటిగాను ము ఓమనసా ॥అహా॥

చం॥ మరణము తప్పదింక అనుమానము లన్నెడబాసి విల్వు । యీ ధర తలిదండ్రులెవ్వరును । వెంబడిరారని తెల్సుకొమ్ము । నీ గురుని పదారవిందములు । కోరిభజించు సుఖంబుకెంపె । వే మరువక నాదుమాటలను । మన్ననచే వినుమింక మానసా ॥

## 7. తత్వము - ఆట

1. యేది మనకుల మెటులనున్నాదో చూపించు భడివె । ఏది మ
కులమెటులనున్నాదో । ఏది మనకుల మెటులనున్నదో । మా
వులకే పుట్టినామట । గురుపాదు దెల్యక లమిదికొడ్కులు వా
భేదములాడుచుందురు ॥యేది॥

2. ముందెనేత్రములందె యుంటిమీ । మూణ్నెల్లవరకు ము
గర్భములోన యుంటిమీ । ముట్టులోపల మనముబుట్టి । ము
రక్తము త్రాగిబతికి వట్టిమానవ జన్మమెత్తి గుట్టుదెల్యవు ల
కొడుకా ॥యేది॥

3. తల్లిదండ్రు లెందరైనారు । తనుబుట్టినుంచి తల్లికే మొగలెం
రైనారో । యుల్లమందున గానలేకను అల్లి బిల్లి గుణంబుసే
తల్లితండ్రి తావుతెల్యక తర్కమాడెటి ధవిడికొడ్కా ॥

4. ఆడదానికి మనము బుట్టితిమీ । కొన్నాళ్ళవరకు ఆడదానిని పెం
మంటిమి । ఆడదాని కొడ్కుయనెడి యర్థమేమో తెల్యలేక తో
గూడి బిడియమొదలక పాడుబడితి రండకొడ్కా ॥యేది॥

5. నిందనీవకరీని జెయ్యకు । నీల్గాచు నిక్కుచు పందిపై పరుగు
షారకు । అందముగ మనమంత బుట్టిదానికే గుర్తయి వున్న

6. మత్సరంబున నీవు మరువాకు । పెద్దాల జూచిన కుక్కరీతి
మొరుగుచుండేవు । లుచ్చసంగతి బట్టి నీవు వచ్చి పొయ్యే వా
జూచి । పక్షపాతపు మాటలాడితె చచ్చిపొయ్యేవు లుచ్చకొడ్క

7. కోతిగుణములు నీవు మానావు । కొన్నాళ్ళవరకు పాతకము
మునిగిపొయ్యేవు । ఖ్యాతితో ముక్కోటి లక్ష్మయ్య నీతి
దెల్పేవమాట । చేతగాదని విడచిపెడితే గాటబడియెవు గాడ్దికొడ్క
॥యేది మనకులమెటులనున్నాదో॥

## 8. తత్వము - ఆట

1. ముక్కుపుల్లగొనిచ్చె మొగదక్కా । యెల్లప్పుడూ నన్ ముక్కు దిక్కే చూడుమనెనక్కా । ముక్కుపుల్లా చక్కదనమక్కా । పెక్కేల భక్తులు చూచియు ఆనందపడిరక్కా । ముక్కోటి దేవతాలు ముక్కున ధరియించుకోని । చక్కగా సహస్రార మణిమయ నగరమున గూర్చుండునక్కో ॥ముక్కు॥

2. చొక్కమైన రౌతుమెరుపక్కా । చక్కని పున్నమనాటి వెన్నెల బట్టబయలక్కా । యెక్కడెక్కడ వెతకి చూచేన యెట్టి వారికి జిక్కలేదట । మొ9క్కిసద్గురు సేవజేసిన దక్కునట యీ ముక్కెరక్కా ॥ముక్కు॥

4. పోదగొట్టకు భద్రమనెనక్కా । పడిపోతె దొరుకదు । జోతిపురిదీ జాతి రౌతక్కా । ఈద పింగళ జోడు నంబిలో జారగని సోహంబు నడిపితే । గూఢముగనున్నట్టి । హంస ముక్కువా యిమిడున్నదక్కా ॥ముక్కు॥

5. మాయత్త బట్టది చూచివాదక్కా । మాయాకాయగ దృష్టిజాలగ దిష్టిదగలకా । మాయ మాయ ముక్కుపుల్ల । మూలమేమి లేవిదాయ । కలలదోచిన చందమాయ కానుపించ దాయెనక్కా ॥ముక్కుపుల్ల॥

6. వాసిగా చందూరిపురమక్కా । దాహూడు పీరయోగిదెల్పిన తత్వమినుమక్కా । వాసికాగమందు ముక్తికాంత ముక్కున వెల్గుచున్న । భూషణంబైనట్టి ముక్కెర మరిచితే పుక్కెక్కెతక్కా ॥ముక్కుపుల్ల॥

